Reg. No. 757

# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
ప్రచురింపఁబడుచున్నది.
గుంటూరు.

| సంపుటము 33 | 1941 సం॥ ఏప్రిల్ నెల 15 వ తేది | సంచిక 1 |
|---|---|---|

విషయసూచిక.





చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | 10 0 0 | సాధారణ చందాదారులకు | రు 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# రాజపోషకులు.

శ్రీమంతు, రాణీ ఆదిలక్ష్మీదేవమ్మ బహాదరుగారు,
గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీశ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకర భారతీస్వాములవారు, హంపి.

౨ శ్రీశ్రీ జగద్గురు, అభినవోద్దండ విద్యాశంకరభారతీ స్వాములవారు, పుష్పగిరి

3 తంగెడ నరసింహారావుగారు, కరణము, మోర్జంపాడు.

౪ ఆర్. రామారెడ్డిగారు, డైవముదిన్నె.

౫ రాజా సురభి వెంకటరత్నాంబ బహాదరుగారు, రాణీ, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురము

౬ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౭ రాజా రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

౮ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

౯ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇనునూరు.

## పోషకులు.

౧ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ రాజా కందు గారు బాహార్యప్రసాదరావు బహద్దరు జమీందారుగారు - దేవిశి

3 కాండ్రి వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, బసవాపురము.

# అభినవసరస్వతి

సంపుటము 33 | వృషనామసంవత్సరము చైత్రమాసము | సంచిక ౧



## —♦ కృతి విమర్శము ♦—

వృషసం॥ పంచాంగము — ఇయ్యది బళ్ళారిజిల్లా, ఆదవాని మ్యునిసిపల్ హైస్కూలు ప్రధానాంధ్రపండితులును గావ్యభూషణాది ఘనబిరుదాంకితులును నగు తోలేటి భాస్కరశాస్త్రి గారిచేతను దద్ద్వితీయపుత్రుఁడగు సోమసుందరశాస్త్రిగారిచేతను గుణింపఁబడినది. రాజైన శుక్రుఁడును మంత్రియైన రవియుఁ బరస్పరవిరోధు లగుటచే రాజు లసూయాపరులై కలహించుచుఁ బ్రపంచమునకు శుభావహులుగా నుండరనికాఁబోలు భాస్కరశాస్త్రి గారు పంచాంగమున ఫలమును బ్రకటించిరి కాని యది శుభావహులుగా నుండిరని విరుద్ధముగా ముద్రితము. ఇట్టి ముద్రాపకప్రమాదములు చాలఁ గలవు. ఈ సం॥ము గూడ వరి వేరుసెనగ కంది మున్నగునవి యంతగా ఫలింపవఁట. నెయ్యి నూనె యాముదము చింతపండు చక్కెర, బెల్లము లోనగు రసవస్తువులకు వెల యధికమఁట. మొత్తమున కీవర్షంబున జ్యేష్ఠాషాఢంబుల బీజావాపోపయోగియు శ్రావణ భాద్రపదముల సస్యోపయోగియు నగు వర్షమును నాశ్వయుజకార్తికమాసముల నధిక వర్షమును గురిసి పంటలు 9 వీసముల నతిశయించినను వర్షప్రతిబంధమును సస్యనాశనమును నర్ఘాతిశయంబును జోరామయాగ్నియుద్ధభూకంపాది భయంబును దప్పదనియుఁ గృషివాణిజ్యజీవకుల కాదాయ మధికమైయుండుననియు నీపంచాంగపు సిద్ధాంతము. శాస్త్రిగారీ సం॥కు వృషయని కాక విషువని సంజ్ఞయిడి కొంతవ్రాసిరి. కాని యయ్యది చాలదు. శ్లో. బహుధాన్యః ప్రమాథీచ విక్రమోథ వృష స్తథా యనియే నిర్ణయసింధ్వాదుల వర్ణితము. విశేషమైన పాడుకగూడ వృషశబ్దమునకే కలిగియున్నది. పండితకవులగు శాస్త్రిగారి పంచాంగము పరామర్శమున కెడమీయక ప్రశంసింపఁదగి యుండినను భవిష్యత్పంచాంగముల మాత్రము పత్తికొండ సరస్వతీముద్రాక్షరశాలనుండి ప్రకటితముఁ జేయకుండ నుండుటకుఁ బ్రబోధింపవలసియున్నది. అక్కడ ముద్రింపించి తమ పంచాంగమును దప్పులతడక చేయకుందురుగాక.

---

## —♦ సంఘసంస్కరణ విషవృక్షదుష్ఫలములు ♦—

[తోలేటి వెంకటరత్నశర్మగారు, వరహాపురము.]

సుమారు మూడు మూడుంబావయ్యెడిని. మామూలుగా నాకు లేచెడివేళయే. కనుకఁ బలుదోముపుడకయుం బొక్కెనయుం దీసికొని బయలుదేఱిపోవుచున్నాను వీధినే. రఘూగారి యింటిలో నేవో గొనగొనమాటలు వినఁబడుచున్నవి. ఏదో ఇష్టగోష్ఠియే కదాయని నాదారినే నేను బోయినాను. బహిర్దేశానకుఁ బోయివచ్చి దంతధావనము చేసి యిఁక స్నానముచేయుదమని నడుముకుఁ గొల్లాయగుడ్డ బిగించి యథాప్రకారముగా

స్నానాలుచేసెడి రెండవతట్టునకుఁ బోయి నూతిలోఁ జేఁదవేయుచుఁ దాఁగాఁడిమీఁదఁ గాలు వేయఁబోయెడిసరికినే రాయి తగిలినది. ఎవరో యల్లరిసన్యాసులు నీళ్లతోఁడుకొనెడి తాఁగాఁడిమీఁద నేదో యాటకాయతనముకొలఁది రాయిపెట్టినారని తీసి దూరముగాఁ గంచెలోఁ బారవేసినాను. గుడ్డివెన్నెలలో నేదో తెల్లఁగాఁ దాఁగాఁడిమీఁదఁ గాగితము మడతయొకటి కనఁబడ్డది. ఏమిచెపుమాయని తీసినాను. మడత విప్పినఁ బెద్ద కాగితము. ఏదో వ్రాసియున్నదికూడను. నాకు వేజే గమన మంతగాఁ బోనందుచేత నింటికిఁబోయి చూతములే యని కాగితము మడతగానే యొడ్డుమీఁద వేసి స్నానముచేసినాను. ఒళ్లు తుడుచుకొన్నతరువాతఁ గొల్లాయగుడ్డ పిండి కట్టుకొని మఱచిపోయెదనేమో యని రొండిని మడత దోఁపి కట్టుబట్ట యుతికి భుజముమీఁద వేసికొని చేఁదనీళ్ళతో సహస్రశీర్షము చదువుకొనుచు నింటికివచ్చినాను. దేవీస్తవము చేసికొనుచు ముందు భుజముమీఁది పంచ యూఱవేసినాను. మడిదోవతి కట్టుటలోఁ గాగితముమడత క్రిందఁ బడిపోయి నదికాఁబోలు. నేనున్న పరధ్యానములోఁ గాగితముసంగతి స్మృతికి రానే లేదు. సంధ్యావందనము గాయత్రీజపము మామూలుగాఁ జేసివేసినాను. ప్రాతరౌపాసనముకూడ నయినది. అగ్నిహోత్రము దాఁపి దేవతార్చనపువ్వులకని దొడ్డిలోనికిఁ బోయి కోయుచున్నాను. కఱకఱ సూర్యోదయ మైనది. గొల్లుమని దూరముగా నేడుపు వినఁబడినది. ఎవరబ్బాయని యాలోచించుచుఁ జప్పునఁ బూలపాత్ర యింటిలోఁ బెట్టి విచారణచేయుదమని బయటికి రాఁబోవుచున్నాను. అమ్మా! ఎంతపనిచేసినావే యనుచు మాయావిడ పడుచును లేచుచును నెదురుగావచ్చినది. ఆ యేడు పేమే యన్నాను. ఇంకేమున్నది, రఘూగారి రంగపాలమునూతిలోఁ దేలియున్నదఁటయనుచు దొడ్డితలుపు బిగించిపోయినది.

నాయొడలు ఝల్లుమన్నది. స్తబ్ధుఁడనై పోయినాను. అంతసేపుస్నానము చేసినను నా కేమియుం ననుమానము కలుగలేదేమియని యనుకొనుచుండఁగానే తటాలునఁ గాగితమువిషయము జ్ఞాపకమువచ్చినది. గదిగుమ్మములోనే యున్నానుగాదూ? రొండి సవరించుచు వెనుకకుఁ దిరిగిచూచినాను. గోడప్రక్కనే పడియున్నది కాగితము. చివాలునఁ బోయి మడతవిప్పి పరికించినాను. అనుకొన్నంత యయినది. అక్షరము సాఁగదే! కనులు చీఁకట్లుకమ్మిపోయినవి. తుదకు మనస్సు చిక్కఁబట్టి చివరదాఁక నేలాగో యొకలాగు చదివినాను. ఔరా! ఎంతసాహసముకిల్లరా యనుకొన్నాను. ఏమిచేయుదును ? ఏమి చేయవలెనో తోఁచలేదు. మరలమరలఁ జదివినాను. హృదయకోశము చిన్నదైనను సముద్రతరంగములవంటి చిత్రచిత్రభావపరంపర కంతులేకపోయినది. ఒకటిరెండునిమిషములా? పావుగంటసేపు. కొసకేమైనను సరియే, అలాటిసమయములో నుత్తర మెంతమాత్రము బైటఁబెట్టరాదని నిర్ణయము చేసికొన్నాను. మెల్లఁగాఁ జుగితము మడతపెట్టి గూటిలోఁ బడవేసినాను. మాయిల్లాలి నోటిలో నువ్వుగింజైనను దాఁగదని యామెకుఁ గూడఁ జివరకప్పుడు చెప్పలేదు. రెండుమాసాలపైన గడచినది. పరిస్థితు లేలాగుజరిగిపోవలెనో యవెల్లను జరిగిపోయినవి. ఇఁక భయములేదుకదాయని రఘూగారి చరిత్రలో నెంతవఱకుఁ బాఠకలోకానకుఁ దెలుపవలసిన బాధ్యత నాయందుఁ గలదో యంతవఱకు మనవిచేయుచున్నాను. సావధానముగాఁ జిత్తగింపుఁడు బుద్ధిమంతులు.

అసలు రఘుపతిరావుగారు. అందఱును రఘూగారనియెదరు. గ్రామములో నొక మాదిరి స్థితిమంతులు. గ్రాడ్యుయేటు. 1930 యస్.సి.వో. మూవ్మెంటులో జైలుకుఁ గూడఁ బోయినవారే. కొంచెము సంస్కరణాభిలాషులు కొద్ది కోపిష్ఠమనుష్యులుకూడ. వారి కిద్దఱు కొమార్తెలు. ఒక కుమారుఁడు. ఆడపిల్లలు పెద్దవాండ్రు. మంచి చుఱుకైన వాండ్రు. అందులోఁ బెద్దమ్మాయిపే రూర్మిళ. పదియేడేండ్లుండెడిని. ఇంకను వివాహము కాలేదు. సంస్కృతము బాగుగాఁ జదువుకొన్నది మాతామహునివద్ద. ఈ గందరగోళము జరిగెడికాలానకు విజయనగరములో నేదో శాస్త్రము చదువుచున్నదని వినికిడి. రెండవపిల్లకుఁ బండ్రెండేండ్లు వెళ్ళెడిని. పిల్లఁ జిదిపి దీపముపెట్టవచ్చును. పేరు రంగ. సెకండుఫారముకాఁబోలుఁ జదువుచున్నది. చదువు కొద్దియైనను నా యద్భుతమైన తెలివితేటలు లోకవిలక్షణము. ఇంకను రజస్వల కాలేదు. వివాహమును గాలేదు. మగపిల్లని కేడేండ్లుండెడిని- రఘూగారి భార్యమాత్రము మంచిశ్రోత్రియకుటుంబములోనియావిడ- పాపము చదువు విశేషము రాదు- పేరు సుభద్రమ్మ- పుట్టింటివారు దిట్టమైన శ్రీమంతులు- పెద్దపిల్లకు వివాహపుటీడు తప్పినదగ్గఱనుంచి పాప మామానవురాలు చిన్నతనమై కాఁబోలుఁ బుట్టింటికిఁ బోవుట మానివేసినది. సుభద్రమ్మ తండ్రిగారు గొప్పపండితులు. అయినను నయిదాఱేండ్లనుంచి యేదో దీర్ఘవ్యాధితో మంచమునఁ బడి యంతయు రెండేండ్లయినది స్వర్గస్థుఁడై. ఆయన యుండిన మఱేలా గుండెడిదో.

దాదా పైదేండ్లనుంచి రఘూ సుభద్రమ్మగా రిద్దఱు నాడపిల్లల పెండ్లిండ్లఁగూర్చి వివాదపడుచుండెడివారు. అంతకుమునుపు చిలుకగోరంకులలా గన్యోన్యస్నేహముతో నుండెడి యాదంపతులకు రానురా నింటిలోఁ గీఱనిపోతైపోయినది- చూడుఁడు దైవచిత్రము. రఘూగారు రిఫార్మరుగనుక మహాత్ముని గూఢాభిసంధిపూర్వకముగాఁ దయారైన శారదాశాసనము ననుసరించి రజస్వలయయినప్పటికిని బదునాలుగేండ్లు దాఁటిననే కాని పిల్లలకుఁ బెండ్లిచేయనని పట్టుపట్టినారు- ఇఁక సుభద్రమ్మగారు శాస్త్రదార్ఢ్యమువల్లఁ గాకపోయినను బూర్వాచారాలమీఁదనుండెడి నమ్మకముచేతను బుట్టింటి శ్రోత్రియత్వమునకు విరుద్ధమనెడి యభిప్రాయముచేతను రజస్వలావివాహము కూడదని క్రైస్తవమిషన్ స్కూలులోని హిందూటీచరు లాగు ప్రయోజన మున్నను లేకున్నను నట్టె ప్రతిఘటించుచుండెడిది- మగవాఁడుగనుక రఘూగారి పంతమే నెగ్గినది కొంతవఱకుఁ గాని యూర్మిళ రెండుమూఁడు సమర్తలై బహిరంగమైన తరువాత నయినకులములో సంబంధములువచ్చుట కొంచెముకొంచెము వెనుకాడినవి- వెనుకాడినకొలఁది నింటిలో భార్యపోరెక్కువైపోయినది. స్వభావసిద్ధముగా నభిప్రాయము మార్చుకొనుట కిష్టము లేకపోయినను బరిస్థితులఁబట్టి రఘూగారికిఁగూడఁ గ్రమముగాఁ గొంచెము పట్టు వదలినది. రెండవపిల్ల రంగకైనను రజోదర్శనపూర్వవివాహము చేయుదమని లోలోపల సంకల్పించినారు- కాని యేదో విధముగాఁ బెద్దపిల్లకు ముడిపెట్టిననే కాని చిన్నదానికిఁ జేయుట కిష్టములేదు. ఆయనగా రెక్కడికిఁ గదలెడివారు కారు. రాయబారాలమీఁదవచ్చెడి సంబంధములవాండ్రయినను నంటు ముట్టు నగుచున్న పెద్దపిల్లను జేసికొనుట కిష్టములేక చిన్నదానిసంగతి చెప్పుమనెడి వాండ్రే. ఏదైనను గర్మము చాలక యొక త్రాడు బొంగరము లేనిసంబంధమూ వచ్చిన

నేదో సాకుచెప్పుచు నూర్మిళ యొప్పెడిది కాదు- ఈలాగు గలిబిలిగాఁ గాలము గడచు
చున్నది. సుమారు వారము పదిరోజులలో రంగ యిలా గయిపోఁగల దనఁగా నూర్మిళ
యొక యుత్తరము వ్రాసినది విజయనగరమునుండి తండ్రిగారికి. అది నేనెలా గెఱుఁగుదు
ననెదరేమో! సుభద్రమ్మ స్వయముగా నుత్తరము బాగుగాఁ జదువుకోలేని కారణము
చేతను భర్తయైనను నెందువల్లనో యాయుత్తరము చదివి వినిపించకపోవుటచేతను తాత్కా
లికముగా రంగ యింటిలో లేనిహేతువుచేతను రహస్యముగా నాచేతఁ జదివి వినిపించు
కొన్నది. వెంటనే దాని కాపీ తీసియుంచినా నేదో బుద్ధిపుట్టి. ప్రకృత మవసరముగనుక
దానిని బయలుపెట్టుచున్నా నేమైనను లోకానకుఁ బ్రయోజన ముండెడినేమో యని.

“నాయనగారికి నమస్కారములు- మీరు ప్రేమతో వ్రాసినయుత్తర మందినది-
మీ రుద్దేశించిన యాసెకుర్తివారి సంబంధము నేనిక్కడ నౌకరిద్వారమునఁ బరిశీలన
చేసినాను- ఒక బాకీదారు పెండ్లికొడుకును మూడవసారి వారంటుమీఁదఁ బట్టుకొని
జైలుకుఁ బంపించినను బాకి రాక విసిగి వదలివేసినాఁడఁట- ఎవరో ముసలినాయనమ్మకుఁ
గాఁబోలు నేటను నిచ్చెడి మనోవర్తి కొంచెము నెగురఁగొట్టినాఁడఁట- ఆయన కులములో
దూఱఁ గంతలేక విడోమ్యారేజికై ప్రయత్నము చేయుచున్నాఁడఁట. ఈలాఁటిసంబంధ
ముతో మీకుఁ బ్రయాస యెందుకుఁ దండ్రీ! పవిత్రమైన భారతావనిలో మీవంటి
ప్రముఖులకుఁ దనయనై పుట్టి యుక్తకాలములోఁ గులాచారప్రకార మొక్కనికి సహ
ధర్మచారిణి నై పితౄణము దీర్పఁజాలని నా యభాగ్యజన్మ మాయమ్మగారి యౌవనవన
మునకుఁ గుఠారమైనదికదాయని యొక్కొక్కప్పుడు నాలో నేనే తలపోయుచున్నాను-
ఆర్యావర్తపు మానవస్త్రీకిఁ బశుజాతికివలె దాంపత్యధర్మము కేవలము కామపూరణార్థమే
యగుచో మీ రూహించినట్లు రజోదర్శనానంతరవివాహాదులు పనికివచ్చెడినని గట్టిగాఁ
జెప్పవచ్చు- కాని హైందవ వైవాహికవిధి కేవలము ధర్మబద్ధము- ధర్మమనెడిది యతీం
ద్రియవ్యవహారము- సాధారణముగా మనకు స్వయముగాఁ స్ఫురింపనిదియుఁ గొంచెము
కంటగింపుగాఁగూడ నుండెడిదియు నైనది ధర్మమని మనము తెలిసికోవలె. అట్టిధర్మము
తపోవంతులైన మన ప్రాచీనఋషులచేత నీవఱకే నిర్ణయింపఁబడ్డది- దానిని మనము
సంస్కరింపరాదు- సంస్కరణోద్దేశము తప్పు- ఉత్తరముగనుక నింతకంటె విశేషముగా
విషయములను సప్రమాణముగా మీకుఁ దెలిపెడి వీలు లేనందుకుఁ జింతించుచున్నాను-
మీకు నాయందు నిజమైన ప్రేమయుండిన నిఁక నావివాహప్రయత్నము మానివే
యుఁడు- నేను బెండ్లిచేసికోను- శాస్త్రప్రకారముగా నావంటిది చేసికోఁగూడదుకూడ-
ఇఁక రంగ యొక్కర్తే మీయింట నుండెడిదియు మీకుల ముద్ధరించెడిదియు మీ మాతా
పితౄణము తీర్చెడిదియు నని నమ్ముఁడు- దానికైనను రజోదర్శనపూర్వవివాహము
చేసి మీ బిడ్డఁగాఁ జేసికొనుఁడు. పతితనైన నావల్లనుండి కులమునకుఁ గళంకము వద్దు.
ఆమరణము నే నిలా గవివాహిత గానే కాశీరాజుకూఁతు రంబకుఁ దోడుగా నుండి
యేతద్వివాహాభావదోషప్రాయశ్చిత్తముగా భారతీయనారీమణులకు రజోదర్శనపూర్వ
వివాహమే నైతికముగాను సాంఘికముగాను నాధ్యాత్మికముగాను శ్రేయమని చాటుచు
నూరూరఁ బ్రచారము చేసెదను. నా పర్యటనదీక్షాకాలములో మీయొక్క దర్శన

భాగ్యము నాకుఁ గలుగుచో నితోధికవిషయములు మనవిచేసెదను- అమ్మ పాదారవింద ములకు వందనము. రంగ కాలింగనము. పద్దరాజుకు నా ముద్దు.   ఇట్లు,

యుష్మద్వాత్సల్యపూత, ఊర్మిళాతనూజాత.

ఈయుత్తరము చదివెడిసరికిఁ బరాయివాఁడను, నాకే గుండె తారుమన్నది. ఇఁకఁ గన్నతల్లి కేలాగుండియుండవలెనో మీరే యూహించుకోనుఁడు. కాని రేపురాత్రి కీపని జరుగఁగలదనఁగా నానాఁటిసాయంకాలమునఁ జూచాయగా నొక కబురు విన్నాను. నాతిదగ్గఱ దొరకిన యుత్తరమునుబట్టి చూడఁగా విన్నది నిశ్చయమేయనికూడఁదోఁచెడిని. ఆకబు రేమియనఁగా - పెద్దకూఁతు గూటింపుమీఁద రఘూగారు దాని పెండ్లాశ వదలుకొని యెంతకట్నము పెట్టియయినను సరియే రంగకైనను దొందఱలో వివాహము చేయుదమని నిర్ణయించుకొని తగుపాటి సంబంధముకోసము వారమురోజులు స్వయముగాఁ దిరిగినారఁట. ఎంతదూరము తిరిగినను గాళ్ళలిప్పుడేకాని యాయనగారికి నచ్చిన సంబంధము కనఁబడలేదఁట. చివరకు విసిగి రంగయాత్మహత్యకుఁ బూర్వదినము భార్యను గూఁతును బిలిచి యన్నారఁట, "అయినకుల మయినకులమని వాపోదురు మీరు, అయినకులములో నెక్కడఁజూచినను నన్నవస్త్రములకుఁజాలనివాండ్రు కొంత మంది, అందము, చందము లేనివాండ్రు కొంతమంది, ఈడును జోడును గానివాండ్రు కొంతమంది, అన్నియుఁ గాకపోయినను గొన్నియైనను బాగుండుచో నింకను పెద్దపిల్లకు వివాహముచేసినవారు కారేమని యేమేమో యసంబద్ధప్రలాపాలు చేసెడివాండ్రు కొంత మంది, ఈపాడు వెధవసన్నాసి సాంఘికదురాచారాలు పోనంతవఱకును వచ్చెడి చిక్కు లివి" యని — అంత రంగ యన్నదఁట. "నాయనగారు! ఉన్నంతలో మెఱుఁగు చూచుకోవలెఁగాని లేనిది మనకు రాదుగదా! పోనీ, ఆస్తియు, పాస్తియు నేమియు లేకపోయినను గొంచెము చదువును సంధ్యయు నున్నయేకులపుటింటిసంబంధమైనను నిశ్చయముచేసికొని రాకపోయినారు?" అని - అనునప్పటికి రఘూగారు మండిపడి, "ఔను, పిల్లకాకి కేమితెలియు నుండేలుదెబ్బన్నట్లిప్పుడీలాగే యనెదవు, రే పేమున్నది? అయ్యయు నమ్మయు నాగొంతు తెగఁగోసినారు, గతిలేనికాఁపుర మనుచుఁ జేటయప్పుల కోస మెక్కెడిగడప దిగెడిగడప, నీ యఘోరింపు చూడలేక కొంచెము మేము మా నానకుఁ బెనఁగులాడినామా? ఇల్లు గుల్లచేసికొని నీకొక్కర్తెకే కాకుండ నీమగఁడయ్యకును నీపుట్టఁబోయెడి తొట్టిగంపెఁడు సంతానానకును బెట్టలేక నాశనమ కావలె. అమ్మాయీ! తొంబదిమాటలు దేనికి? నీకును మీయమ్మకును నిష్టమగుచోఁ గులముసంగతి పెట్టుకో కుండ నుండిన యోగ్యమైనసంబంధా లున్నవి. మీయిష్టము చూచుకోనుఁడు. అంతేకాని చూచుచుఁ జూచుచు రంధ్రాన్వేషణములు చేసెడి యయినకులములోని యష్టదరిద్రుల కీయవలెనని నాకు లేదని తీవ్రపడినారఁట. అనెడిసరికి సుభద్రమ్మగారు తోఁకతొక్కిన త్రాఁచులాగ లేచి యిదా వారమురోజులు తిరిగిన సంబంధము? సమర్తాడినతర్వాతి పెండ్లిండ్లే కాకుండ రానురాను గులగోత్రాలులేని పెండ్లిండ్లుకూడఁ జేయవలెనా? అయినకులములో నవ్వుచున్నారని యందఱిని నష్టదరిద్రులనుజేయుటయా? సెబాసు! ఈయర్ధాన్నపుఁబెండ్లిండ్లు చేయుటకు బదు లాడదానిని బుట్టఁగానే యమాంతము కాల్చ

చేతులు నంటఁగట్టి యగాధపు బావిలోఁ బడవేయరాదూ ? చిక్కుతీఱిపోఁగలదని రుసరుసలాడుచు లేచిపోయినదఁట. రంగకూడ విషపునవ్వు నవ్వుచు లేచిపోయి యీమఱునాఁడురాత్రి యెప్పుడో యీ ముత్యమంతపనియుఁ జేసినది. ఆపిల్ల పిడుగుకాను. ఇఁక నుత్తరముకూడ మీయెదుటఁ బెట్టుచో నాపని తీఱిపోఁగలదు. గుణగ్రహణపారీణులవసరమైన నందలి మంచిచెడ్డలు గ్రహించుకొని తోఁచినఫక్కి నవలంబించెదరు.

"భారతసోదరసోదరీమణులారా !

నాయీ యాత్మహత్య లోకములో నావంటివాండ్రకుఁగూడ నాదర్శక మెంతమాత్రము కాకుండుఁగాకయని ముందు ప్రార్థించుచున్నాను గాని నాప్రబోధము మాత్రము సజ్జనాదరణముఁ బడసి చిరస్థాయిగా నుండవలెనని కోరుచున్నాను. నాకు శాస్త్రవాసన లేదు, ధర్మసూక్ష్మాలు తెలియవు. నేఁ జెప్పఁబోయెడిదానిలో నేమైనను మంచియుండుచో నది పెద్దల యనుగ్రహమని మనవిచేయుచున్నాను. మాతాతగారు, తఱచుగ నొకమాట యనుచుండెడివారు. అది నాకు బాగుగా నస్థిని బట్టినట్లు జ్ఞాపకమున్నది. హైందవస్త్రీ యుక్తకాలములో యోగ్యుఁడైన యొక్కని ధర్మపత్నియై పిల్లయుఁ జెల్లయుఁ గలుగనీ కలుగకపోనీ భర్తకన్న ముందుగానీ తరువాతఁగానీ పతివ్రతాధర్మము నడుపుకొనుచు మరణించినదనుచో నింతటి దుష్కాలమైనను నాభారతనారీమణికిఁ గలిగెడి పరలోకసుఖము సర్వసంగపరిత్యాగముచేసి యాజన్మబ్రహ్మచారులై పూర్వపు యుగాలలో ముక్తికై పరితపించెడి మహామహాఋష్యాదులకైనను నుండఁగలదా యన్నా యనెడివారు- కాఁబట్టి వైవాహికసంస్కారము కాకుండ రజస్వలయైన దోషముకన్నను ఋష్పవతి కాకమునుపే పరిస్థితులఁ బట్టి సక్రమవివాహము కాదనెడి నిరాశచేతఁ జేసికొన్న యీబలాత్కారమరణమువల్ల నేమాత్రమైనను దక్కువదోషమేమో యని యూహించి నే నీదుడుకుపని చేసినాను-ఓయయ్యలారా! ఓయమ్మలారా! మీయాడపిల్లలకు రజోదర్శనపూర్వవివాహాలే చేయుఁడు-అసవర్ణవివాహాలు వద్దు-పునర్వివాహాలు మొదలే పనికిరావు-మీపిల్లలకు సంబంధాలు విచారించెడి సందర్భాలలోఁ గులగోత్రాది యోగ్యతలకు విద్యాబుద్ధులకుఁ బ్రాధాన్య మీయుఁడు- భోగభాగ్యాలు మెఱుపుతీఁగెలు- రూపరేఖావిలాసాదులు మీసాలమీఁది తేనెలు- కట్నాలుఁ గానుకలు నీచాతినీచము- అవి గౌణాలు- చదువురానిదాననుగనుక నింతకంటెను నా కెక్కువసంగతులు తెలియవు- నాయీ జిలిబిలిపలుకు లేపుణ్యాత్ముఁడైనను లోకాన కందించుచో నందలి తత్త్వము గమనించి యేసజ్జనుఁడైనను నన్నుఁగూర్చి ధన్యవాదాలు పలుకుచో నా సిద్ధవాక్కులవల్ల నాయీ యాత్మహత్యాదోషము తొలఁగిపోయి పుణ్యజన్మప్రాప్తి కలుగఁగలదేమో యని శాస్త్రముమీఁది గాఢమైన నమ్మకముచేత నే నీపనికి సాహసించినాను. ఇఁక సెలవిప్పించుచోఁ బోయివచ్చెదను పార్వతీదేవి కొలువుకు-

ఇట్లు,

ధర్మసత్సంగ, రంగ.

ధర్మైకతత్పరులగు పాఠకమహాశయులారా !

తెలుపఁదగినది తెలుపుటచే నాబాధ్యత కొంత తీఱిపోయినది- విని తెలిసికొని చేయఁదగినది చేయుటతో మీవంటి సరసుల బాధ్యత తీఱిపోఁగలదని విన్నవించుచు విరమించుచున్నాను.

---

## — శ్రీ సనాతనధార్మికయువజనసంఘము —

ఇయ్యది విద్యార్థుల కెల్లరకును విరామసమయము. సంస్కృతాంధ్రాంగ్లవిద్యాలయము లన్నియుఁ మూయఁబడినవి. వేసంగిసెలవు లొసంగఁబడినవి. ఈరెండుమూడు మాసములలో సాధారణముగ విద్యార్థులందఱు స్వగృహముల కేగి వివిధవిలాసచేష్టలతోఁ గాలక్షేపము గావించుచుందురు. వృథాకాలక్షేప మొనర్చుటకన్న నేదేని సత్ప్రయోజనము నాచరించుట సమంజసమగును.

ఇటీవల సార్థసం॥క్రింద సనాతనధర్మపరిచారదృష్టితోఁ గొందఱు యువకులు చేరి సనాతనధార్మికయువజనసంఘమును స్థాపించియున్నారు. సంఘపక్షమునఁ గొన్ని పరీక్ష లేర్పఱుపఁబడినవి. కొలఁదిదినములక్రిందనే ప్రథమపరీక్ష పూర్తియైనది. వ్యాసరచయితలలో నుత్తీర్ణుల కందఱకుఁ దత్తద్యోగ్యతానుసారము బహూకృతు లొసంగఁబడినవి.

మరల ద్వితీయపరీక్షాప్రకటనముగూడఁ జేయఁబడినది. ఏతద్వ్యాసరచనోపయోగి గ్రంథముల సూచికయు నాప్రకటనపత్రమందే కలదు.

మానవజీవితములో వివాహమనునది యొక ముఖ్యతమఘట్టము. ఈవిషయముననే నేఁడు లెక్కకుమీఱిన వాదోపవాదములు వెల్లివిరియుచున్నవి. భారతీయుల దృష్టిలో వివాహ మొక పవిత్రతమసంస్కారము. పాశ్చాత్యులుఁ దదనుయాయులు నిద్దానిని సాంఘికముగ భావింతురు. ఇట్టిభావనయే నేఁడు ధార్మికజనకంటకముగ నున్న శారదాశాసనాదుల యావిర్భావనిదానము.

వివాహ స్వరూపము ప్రయోజనము యోగ్యవయస్సు మొదలగు విషయము లన్నియు సమగ్రముగ సవిశేషముగ హైందవధర్మశాస్త్రములలో నిరూపింపఁబడియే యున్నవి. కాని పాశ్చాత్యశిక్షావికృతమస్తిష్కులైన నవనాగరకంమన్యులు వానిని దిన్నఁగ నర్థముఁజేసికొనఁజాలక పెడత్రోవలం బడిరి. ధర్మానుకూలములగు బాల్యవివాహములు దంపతులభావిశ్రేయోభంజకములు గాన నాపద్ధతిని సంస్కరింపవలెనని కొందఱు ధర్మశాస్త్రములే రండారజస్వలోద్వాహాదుల కభ్యనుజ్ఞ నిచ్చుచున్నవని కువ్యాఖ్యలఁ జేయుచు మఱికొందఱు ఘోషింపసాగిరి. ఏతాదృశదుర్వాదనిర్వాపణార్థము యథార్థనిర్ధారణార్థము సుగృహీతనామధేయులగు పండితప్రకాండులు పలువురు వివిధభాషలలో విమర్శగ్రంథముల రచించి ప్రకటించిరి. ఇట్టి గ్రంథములఁ జదివి కువ్యాఖ్యావిషమూర్ఛితయగుచున్న సనాతనవైదికధర్మదేవతను సంరక్షింపవలసిన భారము భారతీయు లందఱిపై నున్నది. అందును విశేషించి భావిభారతదేశీయ సుఖదుఃఖభాగస్వాములు గానున్న నవయువకులపై నీభార మున్నదనుట కెట్టిసందియమును లేదు.

కావున ధర్మాభిమానులగు యువకులు నేఁటినుండియే జాగరూకులై యుండవలెను. వంచనాచతురులగు వైదేశికులయొక్కయు వైదేశికశిక్షాదగ్ధమతులగు దేశీయులయొక్కయుఁ గువాదజాలములలోఁ బడి ధర్మమార్గమునకు దూరులై యిహపరసుఖభ్రష్టులు గాకుండ నాత్మరక్షణ మొనర్ప నిత్యసన్నద్ధులై యుండవలెను.

ఇంతియ కాని యిది విలాసఖేలనములతోఁ గడపఁదగినసమయముమాత్రము కాదు. నే నెవఁడను? నాజీవితలక్ష్య మేమి? నా ధర్మ మేది? నిజమునకు నాధర్మమం

దేమిలోపము గలదు! స్వమతముకన్న నన్యమతములలోఁ గల యాధిక్యమేమి ? కొన్ని కోట్ల వత్సరములనుండి యవిచ్ఛిన్నముగ వచ్చుచున్న నా మతధర్మసంప్రదాయముల నధునాతనులు తూలనాడుటలోఁ గల రహస్యమేమి ? నా పూర్వులకన్న నీ రెక్కడు విజ్ఞానసంపన్నులగుదురా ? అని విచారమొనర్పఁదగినసమయము. అట్లు విచారించి పర మతప్రచారకుల ప్రశ్నలకు సముచితప్రత్యుత్తరముల నిచ్చుచు స్వమతశ్రద్ధాబద్ధులై మెలంగవలసిన సమయము. ఇట్లాత్మరక్షణకే కాక మంచిచెడుగుల విమర్శించి తెలియఁ జాలని యమాయికప్రజల ధర్మద్రోహుల బారినుండి తప్పించి స్వమతధర్మదూరులు కాకుండఁ జేయవలసిన సమయము. ధర్మాభిమానుల కిది పరీక్షాసమయము. ఇట్టిసమయము నేయుత్కృష్టప్రయోజనజనకమును గాని విలాసములతో సరిపుచ్చుటెంత తెలివిమాలినపని!

నిజమునకు నేఁటి సంస్కృతపాఠశాలలలో సైతము మతధర్మవిజ్ఞానసంపాదనమునకుం దగిన స్థానము లేదు. ఆంగ్లవిద్యాలయముల సంగతి యడుగవలసినదే లేదు. అస లచట నిట్టి ప్రసంగములకే యవకాశ ముండదు. అహర్నిశము నన్యశిక్షావ్యాసంగమే కాఁగా నేఁటి విద్యార్థిబృందము దాదాపు ధర్మవిషయమున నంధప్రాయముగ నున్నది. వారికి ధర్మవిజ్ఞానము గల్గించుటకుఁ బ్రత్యేకప్రయత్నము లవసరములైయున్నవి. అట్టిప్రయత్న మునే ప్రస్తుతము సనాతనధార్మిక యువజనసంఘమువారు ధార్మికపరీక్షానిర్మాణరూపమున జరుపుచున్నారు. ఈ పరీక్షలలోఁ బాల్గొని ధర్మానుష్ఠాతలుగ మాత్రమే కాక ధర్మప్రచారకులుగాఁ గూడ విద్యార్థు (యువకు)లు తయారుగావలెను.

సాధారణముగఁ బ్రతివిద్యార్థికిని బఠనీయగ్రంథములు నియతములై యుండుటచే నిత్యకృత్యమున నన్యగ్రంథావలోకమున కవకాశమే యుండదు. ఇఁక విరామ (సెలవు) దివసములలోనె యొకింత వీలుచిక్కవలె. అంతకుఁబూర్వ మనుదినము బహుళపాఠ్యగ్రంథాధ్యయనముతోఁ దలదిమ్ముపట్టియుండు విద్యార్థు లీవిరామదివసములనైన హాయిగ గడ పుట కవకాశము లేకుండ నీపరీక్ష లెటనుండి దాపురించెనని పలువురు కంటకపడవచ్చును. కాని యీపరీక్షావ్యాసంగ మంత శ్రమకరముగ నుండదు.

దినము నంతయు యథేచ్ఛావ్యాపారముతో గడపినను నే యొకగంటలోనో దీనికై కృషిసల్పినఁ జాలును. వివిధవిలాసఖేలనములలో దీనినిగూడ నన్యతమముగ భావించిన శ్రమయనుపించదు. సాధారణముగ నిట్టివిరామసమయములలోఁ బలువురు శ్రద్ధ వో౯క నవలానాటకగ్రంథావలోకన మొనర్చుచుందురు. అట్లే యొక్కొక్కప్పుడీధార్మిక గ్రంథములనుగూడఁ జూచుచుండవచ్చును. ఇంతియ కాక యథాతిరుచ్యే మధురేపి రుచ్యుత్పాదనాయ రుచ్యంతరయోజనార్హా యన్నట్లు తామొనర్చు నిరంతర నవలానాటకగ్రంథాధ్యయనమునకు నడుమనడుమ నీధార్మికగ్రంథాధ్యయనము సహకారిగఁ గూడ నుండఁగలదు.

ఇంతయేల ? ఒకింత శ్రమకారిగనే యుండవచ్చుననుకొందము. ఏననేమి? పవిత్రతమ భారతీయవైదికధర్మవిజ్ఞాన సముపార్జనకై, ధర్మద్రోహుల కువాదములఁ గూలఁ ద్రోయుటకై, క్షీణించిన వేదశాస్త్రవిశ్వాసమును సన్నగిలిన ధర్మాభిమానమును వికలము గావింపఁబడిన మతసంస్కారములను విశ్వవిఖ్యాత పురాతన భారతీయౌన్నత్యమును మరల

సముద్ధరించుటకై యీపాటి స్వల్పశ్రమను సహించుట యొక లెక్కయా? యత్కించిద్ధర్మాభిమానముగల వ్యక్తియైనను నేమాత్రమవకాశమున్నను దీనికి వెనుకంజ వేయఁజాలఁడు.

కాన నో ధార్మికయువకులారా! భావిభారత సౌభాగ్యహేతుభూతులారా! అమూల్యమగు కాలము ననవసరవ్యాసంగములతో గడపక ప్రస్తుత ధర్మవిప్లవమును గుర్తించి సనాతనధార్మికయువజనసంఘోద్యమమును గమనించి భారతీయులము హైందవులము ననుకొనుచున్న మీకర్తవ్యమును స్మరించి స. ధా. యు. సంఘమువారి ప్రస్తుత పరీక్షలోను దరువాతజరుగు పరీక్షలలోను బాల్గొనుఁడు. మీమిత్రులనుగూడఁ దగురీతిఁ బ్రోత్సహించి వారినిగూడఁ బాల్గొనఁజేయుఁడు. సంఘోద్యమమును సఫలముగావింపుఁడు. తన్మూలమున నిహపరలాభముల నందుఁడు. ధర్మో రక్షతి రక్షితః

సంస్కృతాంధ్రాంగ్లపాఠశాలోపాధ్యాయులు దయతోఁ దమ యంతేవాసులగు యువకులఁ బ్రోత్సహించి ధర్మప్రచారవృష్టితో మాసంఘపక్షమున జరుపఁబడుచున్న యీ పరీక్షలోను జరుగుపరీక్షలలోను బాల్గొనఁజేసి మాయుద్యమమును సఫలముగావింప సవినయముగ నభ్యర్థించుచున్నాము. ధార్మికయువక (విద్యార్థి) సోదరులు విరామములో వృథాకాలక్షేప మొనర్పక యీ పరీక్షలలోఁ బాల్గొని ధర్మవిజ్ఞానసముపార్జనముఁ జేసి యిహపరలాభముల నందఁగోరుచున్నాము.

## విషయము.

ఇందు వివాహస్వరూపము వివాహోద్దేశము వివాహయోగ్యవయస్సు బాల్యవివాహములు రజస్వలా స్వయంవరవివాహములు విధవావివాహములు నసవర్ణవివాహములు వివాహబంధవిచ్ఛేదము మొదలగు విషయములను సాధ్యమగునంతవఱకు విచారింపవలెను. ఈ వ్యాసరచనకు శ్రుతి స్మృతిపురాణాదులే కాక యీ క్రిందిగ్రంథములుగూడ సహాయపడఁగలవు.

(1) ధర్మవ్యవస్థావజ్రదర్పణము, (2) ధర్మవ్యవస్థావజ్రహారము, (3) ధర్మసిద్ధాంతసంగ్రహము, (4) స్త్రీపునర్వివాహదుర్వాదనిర్వాపణము, (5) గృహరాజ్యము, (6) బాల్యవివాహతత్త్వసారము, (7) **Early marriage,** (8) **Infant mortality and Hindu Customs,** (9) **Laws of sex,** (10) **Safe marriage.**

## నియమములు.

(1) శ్రుతి స్మృతి సదాచారవిశ్వాసశాలులగు 30సం॥ మించని యీడుగల బ్రాహ్మణయువకు లందఱు నీపరీక్షలోఁ బాల్గొనవచ్చును. (2) ఉత్తీర్ణుల యోగ్యతానుసారము బహూకృతు లీయఁబడును. (3) వ్యాసములను 30–6–41 తేదీ దాఁటకుండ 0–2–0 ల తపాలాబిళ్లల శుల్కముతో మా కంపవలెను. (4) స. ధా. యు. సంఘ సభ్యులకు మాత్రము శుల్కము లేదు. (5) వ్యాసకర్తలు తమపేరు తండ్రిపేరు

వయస్సు నభ్యస్తవిద్యావివరము నడ్రెసు విశదముగ నొక ప్రత్యేకపత్రముపై వ్రాసి పంపవలెను. కాని వీనిని వ్యాసముపై వ్రాయరాదు. (6) ఇతరవివరములఁ దెలియఁగోరువారు ప్రత్యుత్తరములకుఁ దగు తపాలాబిళ్ళలతో మాకు వ్రాయవలెను.

## నెం. 1 రు వ్యాసరచనా పరీక్షా ఫలితములు

మాసంఘపక్షమున జరుపఁబడిన నెం. 1 రు వ్యాసరచనాపరీక్షలో హరి లక్ష్మీనరసింహము (సంస్కృతముకాలేజీ, నెల్లూరు) గారు ఉత్తమకక్ష్యలో నుత్తీర్ణులైరి.

మఱి ముగ్గురు మధ్యమకక్ష్యలోను ముగ్గురు సాధారణకక్ష్యలోను నుత్తీర్ణులైరి. ఉత్తీర్ణులు మొత్తము 7 గురు.

వీరి కందఱికిని దత్తద్యోగ్యతానుసారము బహూకృతు లొసంగఁబడినవి. ఉత్తమకక్ష్యావిద్యార్థి బహూకృతిని బ్రి॥ ధర్మోద్ధారక వినపాముల లక్ష్మీనరసింహము (గుంటూరు) గా రొసంగిరి.

చౌటపాపాయపాలెమగ్రహారము, } బెల్లంకొండపోష్టు, గుంటూరుజిల్లా. }

సన్నిధానం బాలకృష్ణమూర్తి,
కార్యదర్శి.

---

## —♦ నీవొక పత్రికాధిపతివి కావలెనన్నచో ♦—

[మల్లం నాగభూషణముగారు, యం. ప. సం]

[పత్రికాధిపతులఁ బరోక్షముగా స్వధర్మమును గుర్తింపఁజేయుటే యీ వ్యాసోద్దేశము.]

ఒక కలము దస్తా తెల్లకాగితములు నొక యచ్చుకూటము సమకూర్చుకొనినఁ జాలును. ఇట్టే యెడిటరైపోవచ్చును. సత్య మసత్యముచేతను నసత్యము సత్యముచేతను నెవ రెంతబాగుగాఁ బూఁతపూయఁగలిగిన వా రంతగొప్ప యెడిటరులు. కాని నీతినియమములు లజ్జాభిమానములు భయభక్తులుఁ గడఁద్రొక్కవలయును. అర్థసిద్ధికి వేశ్యాగృహము సారాకొట్టుఁ గాఫీహోటలుఁ దరువాతఁ బత్రికాకార్యాలయమునే పరిగణనీయము. పైకముకావలయునన్నచో ధనముగల పంద నొకని వెదకి వాని ఫోటోను నీపత్రికయందుఁ బ్రకటింపుము. దానిక్రింద నభినవదానకర్ణుఁడనియో కలియుగదానకర్ణుఁడనియో పెద్దక్షరములతో నచ్చొత్తించి వీలువెంటఁ బొగడుచు నొక చిన్న వ్యాసముగూడ వ్రాయుము. మఱునాఁ డతఁడు నీపత్రికకు మహారాజపోషకుఁడై వేయినూటపదియాఱులు నీయొడిలో గల్లుమనిపించునో లేదో చూడుము ... మన్నుమందుగాను మందు ననుపానముగాను బ్రయోగించు వైద్యశేఖరుల ప్రకటనలు దొరకినన్ని సంపాదింపుము. నీవు ప్రయాసపడ నక్కఱలేదు. వారే నీకిచ్చెదరు. అప్పుడు నీపని చూచుకొమ్ము, తారామండలమున కంటునో లేదో. మనలోమాట, ఎవరితో ననకుము. ప్రపంచములో మొదట నిన్నిరోగములు లేవు. మందులే వీనిని బుట్టించినవి. పత్రికాధిపతుల పుణ్యామని బ్రతుకుచున్నవి. ఇక వార్తలఁ బ్రకటించుటలో మిగుల జాగ్రత్తకలిగి యుండవలయును.

ఉన్నవి యున్నట్లు ప్రకటించరాదు. ఎద్దీనినదనియో యెలుక పిల్లిని బెట్టినదనియో పిల్లి కుక్కను మ్రింగినదనియో యేవో విపరీతవార్తలఁ గల్పించుటలోనే యున్నది గమ్మత్తంతయు. నీ వెవరినిగుఱించియైన వ్రాయునప్పు డతఁడు విద్వాంసుఁడనియో మేధాసంపన్నుఁడనియో కళావేత్తయనియో రసికజనావతంసుఁడనియో యొక విశిష్టత నాపాదింపుము. నిజముగ నిట్టివిశేషములు గలవారిని గుఱించి వ్రాసెదవుచుమా! కొంప మునిఁగిపోవును.

మఱేమియు లేదుకాని యట్టివారిని బైకిఁదెచ్చినచో నసలుకే యెసరు పెట్టి నిన్నుఁబాతాళమునకు నెట్టివేయుదురు ... కనుక నట్టి వారినిగుఱించి వ్రాయక వట్టి డొంబయ్యలను గనిపెట్టి వారికిమాత్రమే యీవిశేషణములు తగిలింపుము. కలలోనైన నవ్వులకైన సత్యవాదిని ధర్మమూర్తిని న్యాయశీలుని దరికి రానీయకుము. కనుచూపు మేరలోఁ దుపాకి గుఱిపెట్టి యుంచుకొనుము. నీ వెవరినైన నవతారమూర్తియనఁ దలంచినచో వింధ్యపర్వతమున కవతలివానినే కాని యివతలివానిని న స్మరేత్. ఇది బాగుగా జ్ఞాపకముంచుకొనుము. సంపాదకీయములలో నున్నది తమాషా యంతయు. మునుముందుగ శబ్దార్థముల సంబంధము త్రెంచివేయవలెను. ప్రతిదినముఁ బ్రపంచము ప్రళయములోనున్నట్లే భావించవలయును. మహావాయువులు లేచుచున్నవి. ఝంఝూమారుతములు వీచుచున్నవి. ప్రళయానిలములు బయలువెడలుచున్నవి. సముద్రములు పొంగిపోవుచున్నవి. సప్తసాగరము లింకిపోవుచున్నవి. నక్షత్రములు రాలిపోవుచున్నవి. తారకలు ప్రీలిపోవుచున్నవి. ఇదే ధోరణిలో నుండవలయునుగాని యింతకన్న నెంద్రుక వ్రాసి క్రిందికి దిగరాదు. కవిత్వమును గుఱించికాని చిత్రలేఖనము గుఱించికాని ప్రణయభావములగుఱించికాని విమర్శించవలసివచ్చినపుడుగాని నీకేమి తెలియును?...అవ్యక్తమధురమైన శైలిలో నర్థముకాకుండ వ్రాయవలె. అప్పుడుకాని నీవు రసికలోకచక్రవర్తివని ప్రపంచ మనుకొనదు. నీ కెవరు దిక్కు? తలిదండ్రులైనను దాయాదులైనను దోడి పత్రికలే. వానిని నీవు దూషించను వద్దు. భూషించను వద్దు. (ఔదాసీన్య) మవలంబింపుము. నడుచుచుండినచో దారి యదే కనఁబడును. ఎంతనిచెప్పను ? కాని యొక్క మాట. మఱచిపోఁగూడదు. అది మౌనము ... ముమ్మాఱుచెప్పుచున్నాను. నోరువిప్పి మాటాడుట తప్పని సరియైనచోఁ గులగోత్రములకు నూరుపేరులకు సంబంధించనంతవఱకు నెక్కడకరిగినను నెవరితోనైనను ... సౌభ్రాతృత్వమే కాని వేఱొండు వెడఁజల్లరాదు. ఎడిటరుకాఁబోవుచున్న నీవు కొన్ని సిద్ధాంతము లెరువైనను దెచ్చుకోవలెను. స్త్రీయన్నఁ బత్రికాభ్యుదయానకు మంగళదేవత. ప్రణయకుసుమములతో నామె నుపాసింపుము. సనాతనమను పదము కలికమునకైన వాడరాదు. అథవా యవసరమగుచో నది నిందకే కాని స్తుతి కుపయోగింపరాదు. ఏప్రభుత్వవిధానమైనను బ్రతిఘటించుటయే పరమావధి. ప్రతివిషయములోను నతివాదము. దేశమునిమిత్తము విశ్వకల్యాణము రాష్ట్రమునిమిత్తము దేశాభ్యుదయము కులముకొఱకు రాష్ట్రాభిమానము కుటుంబముకొఱకు గులపు, కట్టు తన కొఱకుఁ గుటుంబము మంటఁగలుపవలయును.

## —♦ శ్రీరామ భుజంగప్రయాతస్తోత్రమ్ ♦—

(శ్రీమచ్ఛంకరాచార్యులవారు)

[శ్లోకములు.]

విశుద్ధం పరం సచ్చిదానందరూపం
గుణాధార మధారహీనం వరేణ్యం
మహాంతం విభాంతం గుహాంతం గుణాంతం
సుఖాంతం స్వయంధామ రామం ప్రపద్యే. 1

శివం నిత్య మేకం విభుం తారకాఖ్యం
సుఖాకార మాకారశూన్యం సుమాన్యం
మహేశం కలేశం సురేశం పరేశం
నరేశం నిరీశం మహీశం ప్రపద్యే. 2

యదాఽవర్ణయ త్కర్ణమూలేంతకాలే
శివో రామరామేతి రామేతి కాశ్యాం
తదేకం పరం తారకబ్రహ్మరూపం
భజేహం భజేహం భజేహం భజేహం. 3

మహారత్నపీఠే శుభే కల్పమూలే
సుఖాసీన మాదిత్యకోటిప్రకాశం
సదా జానకీలక్ష్మణోపేత మేకం
సదా రామచంద్రం భజేహం భజేహం. 4

క్వణద్రత్నమంజీరపాదారవిందం
లసన్మేఖలాచారుపీతాంబరాఢ్యం
మహారత్నహారోల్లసత్కౌస్తుభాంగం
నదచ్చంచరీమంజరీలోలమాలం. 5

లసచ్చంద్రికాస్మేరశోణాధరాభం
సముద్యత్పతంగేందుకోటిప్రకాశం
నమద్బ్రహ్మరుద్రాదికోటీరరత్న
స్ఫురత్కాంతినీరాజనారాధితాంఘ్రిం. 6

పురఃప్రాంజలీ నాంజనేయాదిభక్తాన్
స్వచిన్ముద్రయా భద్రయా బోధయంతం

భజేహం భజేహం సదా రామచంద్రం
తదన్యం న మన్యే న మన్యే న మన్యే. 7

యదా మత్సమీపం కృతాంత స్సమేత్య
ప్రచండప్రకోపై ర్భటై ర్భీషయే న్మాం
తదావిష్కరోషి త్వదీయం స్వరూపం
సదాపత్ప్రణాశం సకోదండబాణం. 8

నిజే మానసే మందిరే సన్నిధేహి
ప్రసీద ప్రసీద ప్రభో! రామచంద్ర!
ససౌమిత్రిణా కైకయీనందనేన
స్వభక్త్యానుభక్త్యా చ సంసేవ్యమాన! 9

స్వభక్తాగ్రగణ్యైః కపీశై ర్మహీశై
రనీకై రనేకైశ్చ రామ ప్రసీద!
నమస్తే నమోఽస్త్వీశ రామ ప్రసీద,
ప్రశాధి ప్రశాధి ప్రకాశం ప్రభో! మాం. 10

త్వమేవాసి దైవం పరం మే, యదేకం
సుచైతన్య మేత, త్త్వదన్యం న మన్యే,
యతోఽభూ దమేయం వియద్వాయుతేజో
జలోర్వ్యాదికార్యం చరం చాచరంచ. 11

నమ స్సచ్చిదానందరూపాయ తస్మై,
నమో దేవదేవాయ రామాయ తుభ్యం,
నమో జానకీజీవితేశాయ తుభ్యం
నమః పుండరీకాయతాక్షాయ తుభ్యం. 12

నమో భక్తియుక్తానురక్తాయ తుభ్యం
నమః పుణ్యపుంజైకలబ్ధాయ తుభ్యం,
నమో వేదవేద్యాయ చాద్యాయ పుంసే,
నమ స్సుందరాయేందిరావల్లభాయ. 13

నమో విశ్వకర్త్రే, నమో విశ్వహర్త్రే
నమో విశ్వభోక్త్రే, నమో విశ్వగోప్త్రే,

నమో విశ్వనేత్రే, నమో విశ్వజేత్రే
నమో విశ్వపిత్రే, నమో విశ్వభూత్రే. 14

నమస్తే నమస్తే సమస్తప్రపంచ
ప్రభోగప్రయోగప్రమాణప్రవీణ!
మదీయం మనస్త్వత్పదద్వంద్వసేవాం
విధాతుం ప్రవృత్తం సుచైతన్యసిద్ధ్యై. 15

శిలాపి త్వదంఘ్రిక్షమాసంగిరేణు
ప్రసాదాద్ధి చైతన్య మాధత్త రామ!
నరస్త్వత్పదద్వంద్వసేవావిధానా
త్సుచైతన్య మేతీతి కిం చిత్ర మత్ర? 16

పవిత్రం చరిత్రం విచిత్రం త్వదీయం
నరా యే స్మరం త్యన్వహం రామచంద్ర!
భవంతం భవాంతం భరంతం భజంతో
లభంతే, కృతాంతం నపశ్యం త్యతోఽంతే! 17

సపుణ్య స్సగణ్య శ్శరణ్యో మమాయం
నరో వేద యో వేదచూడామణిం త్వాం
సదాకార మేకం చిదానందరూపం
మనోవా గగమ్యం పరంధామ రామ. 18

ప్రచండప్రతాపప్రభావాభిభూత
ప్రభూతారివీర! ప్రభో! రామచంద్ర!
బలం తే కథం వర్ణ్యతేఽతీవబాల్యే
యతోఽఖండి చండీశకోదండదండం. 19

దశగ్రీవ ముగ్రం సపుత్రం సమిత్రం
సరిద్దుర్గమధ్యస్థ రక్షోగణేశం
భవంతం వినా రామ! వీరో నరోవా
సురోవామరోవా జయే త్క స్త్రిలోక్యాం? 20

సదా రామరామేతి రామామృతం తే
సదా రామ మానందనిష్యందకందం

పిబంతం నమంతం సుదంతం హసంతం
హనూమంత మంతర్భజే తం నితాంతం. 21

సదా రామరామేతి రామామృతం తే
సదా రామ మానందనిష్యందకందం
పిబ న్నన్వహం నన్వహం నైవ మృత్యో
ర్బిభేమి ప్రసాదా దసాదా త్తవైవ. 22

అసీతాసమేతై రకోదండభూషై
రసౌమిత్రి వంద్యై రచండప్రతాపైః
అలంకేశ కాలై రసుగ్రీవమిత్రై
రరామాభిధేయై రలం దైవతై ర్నః. 23

అవీరాసనస్థై రచిన్ముద్రికాఢ్యై
రభక్తాంజనేయాది తత్త్వప్రకాశైః
అమందారమూలై రమందారమాలై
రరామాభిధేయై రలం దైవతై ర్నః. 24

అసింధుప్రకోపై రవంధ్యప్రతాపై
రబంధుప్రయాణై రమందస్మితాఢ్యైః
అదండప్రవాసై రఖండప్రబోధై
రరామాభిధేయై రలం దైవతై ర్నః. 25

హరే! రామ! సీతాపతే! రావణారే!
ఖరారే! మురారే! సురారే! పరేతి
లపంతం నయంతం సదాకాల మేవం
సమాలోకయాలోకయాశేషబంధో! 26

నమస్తే సుమిత్రాసుపుత్రాభినంద్య!
నమస్తే సదా కైకయీనందనేడ్య!
నమస్తే సదా వానరాధీశవంద్య!
నమస్తే నమస్తే సదా రామచంద్ర! 27

---

## —:ఆంధ్రమహాసభ:—

నిజామురాష్ట్రమునం దాంధ్రులే యెక్కువసంఖ్యాకులవారగుటం బట్టి వీరికిం గావలయు రాజకీయసౌకర్యముల సంపాదించుటకై ముఖ్యముగా నిది యేర్పడి సాంఘికము గాంగూడ నభివృద్ధిగలిగింపం బాటుపడుచుండును. అంతియే కాని వేదశాస్త్రచోదితము లగువివాహసంస్కారాది ధార్మికవిషయములందుం బ్రవేశించి చర్చించుట కెంతమాత్రము నధికారముగలది కాదు. అట్లయినను దాని నాథులు నిరంకుశముగాం దమకుందోడువారైయిన హైదరాబాదురాష్ట్రీయుల నచ్చటచ్చటివారిని గొందఱిని జేర్చికొని నిజాంరాష్ట్రాంధ్ర మహాసభయని వార్షికముగా సభ లొకొక్కచోట జరుపుచు శాస్త్రనిర్ణీత వివాహాది ధార్మికసంస్కారములను దమకుం దెలియకపోయినను నిచ్చవచ్చినట్లు తాఱుమాఱు చేయం బాటుపడుచున్నారు. ఇది నింద్యమని ప్రత్యేకించి యనం బనిలేదు. మఱియు ని నాథులు వీరి యనుచరులుం గొందఱు బాల్యవివాహము సాంఘికమా, ధార్మికసంస్కారమా, శాస్త్రము లొప్పుచున్నవా లేదా యనెడి చర్చలు చేసెడి కాలము గడచిపోయినదని వాకొనుచుందురు. కాని యది తెలియనిమాట. ఇప్పటికిని వేదశాస్త్రములు నస్మృతు లందుంజెప్పినచొప్పునం బ్రవర్తించుటకుం బ్రయత్నించెడి ప్రాజ్ఞులే కాక పామరులు నైతము బహుళసంఖ్యాకులుగా నున్నవారని చెప్పుట కెంతమాత్రము సంశయింపం బనిలేదు ... శాస్త్రవిశ్వాసము జనబాహుళ్యమునకు లేకపోయినచో శారదాశాసనము పంచమదేవాలయప్రవేశశాసనము మొదలగు నిర్బంధశాసనములం బెట్టించుటకుంగాని వాని ద్వారమునం బ్రజలను శిక్షింపంజేయుటకుం గాని సంస్కర్తలిన్నిపాట్లు పడవలసిన యవసర ముండెడిది గాదు. అట్టి కరుడుగట్టిన వేదశాస్త్రవిశ్వాసమే యవినీతికిని నక్రమసంతానమునకును గలహములకును దావొసంగక భారతదేశము నీనాంటికిని శాంతి సౌఖ్యములతో విరాజిల్లంజేయుచున్నది. శాస్త్రవిశ్వాసముగల్గిన యాంధ్రులందఱును నీయాంధ్రమహాసభను దూరీకరించియున్నారు. ప్రతి సం॥ వీరు జరిపెడి యాంధ్రసభలలో దాదాపు వేయి రెండువేలకంటె నెక్కువజన మొక్కదినమునం జేరునది గాక పోయెడిది. అట్టిదానిని 10 వేలని 20 వేలని పత్రికలలో నిచ్చవచ్చినట్లు వ్రాసికొందురు. ప్రతి సం॥ ప్రతి స్థలమందును జేరిన యాంధ్రమహాసభలో శాస్త్రవిశ్వాసము గల్గినవారు కర్మముచాలక పాల్గొన్నచో ధార్మికవివాహసంస్కారచర్చ వచ్చినప్పుడు తీవ్రముగాం బ్రతిఘటించియే యున్నారు. అత్తఱి సభ గందరగోళ మగుచుండెడిది. కొన్నియెడలం బోలీసుల సాహాయ్యముగూడ నపేక్షింపంబడెను.

ఏమో కృత్రిమోపాయములం జేసి సమ్మతులు(వోట్లు)ఎక్కువగావచ్చినవికాన బాల్యవివాహనిషేధశాసన మవసరమని నిర్ణయింపంబడినదని ప్రకటింతురు. ఇది చూచి చూచి క్రమముగా నదివఱకున్న యాకొలందియాస్తికప్రజలు నీయాంధ్రసభకుం బోవుట మానుకొనందొడంగిరి. కాంబట్టి ధార్మికవిషయములం జర్చింప నర్హతలేని యాంధ్రమహాసభ నిరంకుశముగా మతాచారవిషయములందుం బ్రవేశించి నిర్బంధశాసనములం గోరెడి తీర్మానంబుల నక్రమముగాం గావించి ప్రజలను హింసించుట న్యాయముగాదని తేలినది.

(దివ్యవాణి)

క. కరిణీపరతంత్రుం డై కరివింధ్యాఖాతమున దిగంబడుభంగిన్
దరుణీపరతంత్రుం డై తరుణుం డురుదైన్యమందుఁ దగులువడు మునీ!

ఆ. పొలఁతిగల్గువాఁడు భోగంబులనుగోరు
పొలఁతిలేకయున్న భోగమున్నె ?
పొలఁతివీడువాఁడు పుడమినంతయు వీడు
పుడమి విడువ సౌఖ్యపడును నరుఁడు. 269

చ. పరమమునీశ్వరా ! భ్రమరపక్షతిచంచలమై దురంత దు
స్తరమగు స్త్రైణభోగసముదాయము నొల్ల, నతిప్రియత్న త
త్పరత జరారుజామరణ తాపవిదూరసుఖప్రశాంతమౌ
పరమ పదంబు నందెదఁ గృపామతి దాని ననుగ్రహింపవే. 270

వ. అనిపల్కి రాఘవుండు మరలనిట్లనియె. 271

—: వార్ధక నింద: —

చ. మొనసిన శైశవంబుపయి ముచ్చట తీరకమున్న క్రూర యౌ
వనదశ దాని మ్రింగు బలవంతముగా, నల యౌవనంబునన్
దనియకమున్న వార్ధకము తద్గ్రసనం బొనరించు, మానిరా
డ్వినుతగుణాఢ్య! కన్గొనుము వీని మిథఃకఠినప్రచారముల్ 272

చ. సదమలకంజముల్ దుహినసంహతిరీతిఁ దృణాగ్రవర్తియౌ
నుదకణముల్ బ్రచండజవయుక్తసమీరముతీరునన్ దటా
స్పదమగు వృక్షముల్ సరయువాహినిచందమునన్ శరీరముల్
ముదిమి నశింపఁజేయు మునిముఖ్య!కరంబును సత్వరంబుగన్ 273

తే. జరఠరూపిణియైన యీజర సమస్త
దేహమున కెంతయేని శైథిల్యమొసఁగి
నరు విరూపునిగాఁగ నొనర్చుఁజుమ్ము
మేనిలోఁ జేరు విసమువిధాన మౌని! 274

క. అతివార్ధక్యంబున శిథి
లతగాంచినయట్టి పురుషులన్ గని యువిదల్
క్షితిలోన లొట్టియలకుం
బ్రితిగాఁగ దలంత్రుసుమ్ము భవ్యవిచారా! 275

ఆ. చెనటి ముదిమి నరుని జేపట్టినంతనే
ప్రజ్ఞ వాని వీడి పాటిపోవు
సవతిపోరితంబు సహియింపఁజాలక
గృహమువిడిచివెడలు గృహిణిభంగి. 276

తే. వార్ధకంబున గడగడవడకువాని
సుతులు దాసులు సతులు స్నేహితులు బంధు
తతులు నితరులు నున్మత్తుగతిని సతముఁ
బరిహాసింపుచునుందురు గురుకృపాఢ్య! 277

క. వార్ధకజర్జరితాంగుని
దుర్ధికుఁ శక్తిహీను దుష్ప్రేక్ష్యతనున్
స్వార్థాశ యావరించును
దుర్ధరగృధ్రంబు చెట్టుతుది వాలుగతిన్. 278

క. ముదిమిని గోరిక లెంతయుఁ
బొదవి మదికి దైన్యదోషమును గూర్చుచు బి
ట్టు దహించి మానవుల నా
పదలన్ బడవైచుఁ బరమభావుకచరితా! 279

మ. "అకటా!వ్యర్థముగాఁగఁ గాలము వ్యయంబయ్యెన్ బరంబందు నా
కిఁక నేదారుణకష్ట మబ్బగలదో!యే నేప్రతీకార మిం
దుకు నేరన్ గద!యేమిసేతు"ననుచున్ దోదూయమానాత్మతన్
వికలత్వంబుగనున్ నరుండు ముదిమిన్ భీత్యావృతస్వాంతుడై. 280

క. ఏనెంతవాఁడ నొకపని యేనియు నొనరింపలేని హీనుఁడ నాకున్
మౌనమె శరణంబనుచున్ దీనత విలపించువృద్ధు దివమున్
రేయున్. 281

ఉ. వాచవులూరు భోజన మెవండిడునంచు మొగంబువాచి యే
నీచతయుం దలంప కెవనిన్ గనుగొన్నను జేయిచాచి తా
యాచనసేయుచున్ బహుళయాతనపాలయి యెల్లవేళలన్
వాచటచున్ నరుండు నిజవార్ధకమందు మునీంద్రవందితా! 282

ఆ. ఉల్లసంబుమీఱ నెల్లభోగంబుల
ననుభవింప మిగుల నాసచెందు

అనుభవించుశక్తి యావంతయును లేక
హృదయమందుఁ గడు సహింపఁబడును. 283

తే. తను నగంబుననుండు వార్ధకబకంబు
వ్యాధిసర్పప్రపీడితమై తదగ్ర
మెక్కి కూయంగ మొదలిడ నింతలోన
నెచటనుండియొ మృతిఘూక మేగుదెంచు. 284

క. మునికూపుసంజఁగనినంతనె చీఁకటి దెసలనుండి తావచ్చిపడుఁ
తనువున ముదిమిం గనినంతనె మిత్తియుఁ బర్వులెత్తి తలపై
[వాలుఁ 285

తే. గీ. పలితకేశప్రఫుల్లపుష్పములనొప్పు
కాయవృక్షంబు దూరానఁ గని బిఱాన
మరణమనియెడు క్రూరవానరము దాని
పయి నధిష్ఠించి నిముసానఁ బాడుచేయు. 286

క. నిర్జనపురమును లతికావర్జితభూజమును వృష్ట్యభావదశాస
మ్మార్జితదేశమును జరాజర్జరితాంగంబుగతి నసహ్యములగునే? 287

ఆ. కాసతోడ వార్ధకమువచ్చిమనుజుల
భక్షణంబొనర్పఁ బటుకయమున
నాశసంబునుండి యఱచుచుఁ జనుదెంచి
గృధ్ర మామిషము గ్రహించునట్లు. 283

క. పసిబాలిక కుసుమముఁగని
వెస ముదమునఁ బట్టి నలిపివేయువడువునఁ
ముసలితనము దేహమును ని
ముసమున నాశమ్మొనర్చు మునికులతిలకా. 289

క. గురుసీత్కారదము రజః
పరుషమునగు వార్ధకంబు పటుమృదుతనువుఁ
బరిజర్జర మొనరించు శి
శిరవాయువు చిగురటాకుఁ జెఱచువిధమునఁ. 290

క. నరపుబలియు వార్ధకజ
ర్జరితంబగు నంగకము తుషారపటలిచే

పరికీర్ణంబయి వాడిన
సరసీరుహమునకు సరిగ సరిపోవుఁజుమీ. 291
క. శిరమును గిరిశిఖరంబున
జరయను రేయెండ పర్వి సత్వరరీతిన్
గరువాతకాసకుముదినిఁ
బరిఫుల్లంబుగనొనర్చుఁ బరమదయాబ్ధీ! 292
తే. జరయనెడు బూది యలమ ధూసరములైన
మనుజశిరములనేరి కూష్మాండములను
బక్వములుగాఁగఁ బరికించి భక్షణంబు
సేయుఁ గాలస్వరూపుఁడౌ క్షేత్రవిభుఁడు. 293
ఆ. వార్ధకాఖ్య దేవవాహిని యాయుఃప్ర
వాహ మతిరయమునఁ బాఱుచుండ
దేహనామక స్వతీరవృక్షమ్ముల
మూలములను దెగించి కూలఁద్రోయు 294
క. జరయను మార్జారము వడిఁ
దరుణిమ మూషికము మ్రింగి తనివందక యా
తురతమెయి నీశరీరపు
టెఱచిన్ గబళింప నుత్సహించుచునుండున్. 295
క. తను జంగలవాసియగుచు
ననవరతాక్రోశవంతమగు వార్ధకమున్
పెనువడుదునుబోలు నశో
భనవస్తువు జగతిఁ గలదె పావనచరితా! 296
తే. శ్వాసకాసాఖ్యసీత్కారసంయుతంబు
దుఃఖధూమాన్వితము తాపదుర్భరంబు
వార్ధకజ్వాల తగులు నెవ్వాని మేని
కతఁడు దగ్ధుండు కాకుండునా? మహాత్మ! 297
క. పూవులబరువున లలితపుఁ
దీవియ వంగినవిధాన దేవ!పలిత శు
క్లావయవంబుల వ్రేగునఁ
జీవతి కాయంబు ముదిమిచే వక్రమగున్. 298

## —• పిల్లలకు నేర్పఁదగు సుగుణములు •—

వార్ధక్యమున దేహపటిమ కలిగి సుఖముగఁ గాలముగడపు వృద్ధుల చరితము నరసినవారు మిగుల నదుపునఁ బెరిఁగినవారనియుఁ బెద్దలవాక్యములందు లక్ష్య ముంచి యుక్తాయుక్తములఁ దలపోసి ముందువెనుక లరసి సంచరించినవారలే యనియు ముమ్మాటికిని ధ్రువపఱచుకొనఁగలరు.

పెద్దలమాట లక్ష్యపెట్టక యుక్తాయుక్తవిచారణ కొనరించుట మాని ముందు వెనుకలాలోచింపక తోఁచినట్లు సంచరించినవా రనేకు లకాలమరణమునొంది రనియు నెవరేని వార్ధక్యముం గాంచఁగలిగినప్పటికి నంగవైకల్యదుస్థితిం గాని తెంపులేని విచారమునొదవించు కష్టవృత్తిచేఁ గాని కాలము గడపవలసినవా రైరనియు బోధపడఁగలదు. కొంచె మోపికచేసి విచారించినవారి కెల్ల నిది ధ్రువపడును.

బిడ్డల నిందించుటగాని మెచ్చుకొనుటగాని మంచిదికాదు. ఏకపుత్రతగల వారి విషయమునను మఱవరాదు. వారు దుడుకుపను లొనరించునపుడును మందు తినక మాఱాట మొనరించినపుడును సాగనిచ్చిన నా యభ్యాసము బలపడును. ఒకటిరెండుసారు లుపేక్షించిన యనంతరము మాన్పుట దుర్ఘటమగును. బుద్ధి తెలిసిన పిల్లలపైఁ దఱచుగ లోపముల నారోపించుచుండరాదు. తప్పు కనిపెట్టినపు డది వారి మనసున నాటునట్లు తెలిపి మరల నట్లాచరించినం దగుశిక్ష చెప్పి యనంతర మాతప్పు గావించినపుడు శిక్షించి మార్గవర్తుల నొనరింపఁ దగుం గాని పలుమాఱు లోపముల నెత్తి దెప్పుచుండిన వారి కది యలవడి మొండిపాఱి మరల నట్లొనరించుచుండెదరు. ఈశ్వరనిర్ణయమునఁ బక్షపాతము లేదని మనమున రూఢించినకొలఁది ధ్రువపడుచుండును. తలిదండ్రుల దేహతత్త్వములే శిశువులం దావిర్భవించి యభివృద్ధిగాంచునట్లు వారి గుణములఁ జర్యలు నభ్యాసములుఁ బిల్లలకు దినపాఠములై వారల ననుకరింపఁజేయును. పిల్లలకు దుస్సహవాసముచేఁగాని మఱియొకకారణముచేఁగాని దురభ్యాసముల నవకాశముకలిగినపుడు వాని సకాలమునఁ గనిపెట్టి నివారింపకుండుట తలిదండ్రుల లోపమే.

రాజును మంత్రియు మంచివారైనఁ బ్రజానురాగము కలిగి వర్తిలునట్లు తలిదండ్రులు మంచివారైనఁ గుటుంబముపై ననురాగముకలిగి యొప్పుచుందురు. ప్రేమాస్పదమగు నవలోకనములును ముద్దులాడుటయు నుత్సాహము పెంచుచు శిశువుల నత్యంత ముదన్వితులఁ గావించి సన్మార్గవర్తుల నొనరించును. ఎంత గారాబమునఁ బెంచుచుండినను బసితనమున వా రొనరించిన తప్పును దప్పుగను నొప్పు నొప్పుగను గ్రహించునట్లు బోధించి తప్పుకు శిక్షయు నొప్పుకుఁ దగు చొప్పును గలిగించుచుండవలెను. నేరములొనరించువారి నడంచని రాజు దేశమున నేరములు ప్రబలునట్లు శిశువులొనరించు లోపములు వారికిఁ దెల్పి తగిన శిక్ష యిడనిచో దుష్టులగుట నిశ్చయము. పెద్దపెరిఁగి వారలే గుణవంతులగుదు రని తలఁచి యుపేక్షించుట సకాలమున మందిచ్చి నివారింపక వృద్ధిపఱచిన

రోగమువలె నసాధ్యమయి చింతాకరమగుట నిశ్చయము. శిశుయోగ్యతాభివృద్ధికిఁ దలిదండ్రుల యైకమత్యము ముఖ్యావసరము. ఇట్టి సవరణలలోనే వారికి భిన్నాభిప్రాయము కలిగి చెఱియొక త్రోవకు లాగుచుండిన శిశువు లా సందు కనిపెట్టి తృతీయమార్గము నాలోచించెదరు. కావున శిశువుల దిద్దుటయం దొకవేళఁ దలిదండ్రు లిరువురిలో భిన్నాభిప్రాయము లేర్పడిన శిశువుల మ్రోల వివదించుకొనక యూరకుండి వారి పరోక్షమున నావిషయముం గూర్చి శాంతచిత్తముతో మాటలాడి నిశ్చయించుకొనినమార్గముల ననంతరము వారికిఁ గఱపుచుండవలెను.

పిల్ల లేదేని తప్పొనరించినపుడు వారిపై నాగ్రహము కలిగినను వెంటనే శిక్షింపక విచారణనిమిత్తమును శిక్షచేయుటకును సమయమొకటి నియమించి యాసమయమున నది తప్పక విచారణ మొనరించి కడుఁ దేలికగ శిక్షించవలెను. అటులాచరింపక కోపోద్రేకము కలిగి కాని బెత్తము చేఁబూని కాని బెదరించుచు విచారింప మొదలిడిన వారు భయమునంది శిక్ష తొలఁగించుకొన నసత్యములాడ దొరకొనెదరు. అట్లుకాక నిదానముగను సావకాశముగను వారివలన నిజము రాఁదీసి యథార్థము నుడివినందులకుఁ దప్పు మన్నించి మరల నటులొనరించకుండ నొప్పించి కలిగినలోటుపాటులను సవరించవలెను.

తలిదండ్రులు క్రూరముగఁ దోచుచుండిన బిడ్డలకుఁ బిరికివారగుటగాని మూర్ఖులగుటగాని తటస్థించును. కావున న్యాయ్యాచరణ కలుగునట్లు బోధించి పిల్లలతోఁ దా మాడుకొనునంతటి ప్రేమయుఁ జనువును గలిగి యెప్పుడును మంచి గావించునది వా రెఱిఁగియుండునట్లు సంచరించవలెను.

పసిపిల్లల శిక్షించవలసినప్పు డీక్రిందినియమములఁ బరిగణించవలెను:—

1 కోపదృష్టితోఁ జూచివదలుట. 2 మందలించియుదాహరణములను జూపుట. 3 చీవాట్లుపెట్టి యిఁక జాగ్రత్తగ నుండ నొప్పించుట. 4 దెబ్బలుకొట్టి జ్ఞాపకముండున ట్లొనరించుట. ఇట్టి శిక్షలు విధించునపుడు కేకలుపెట్టుచు నహంకారము తోఁపనీక మిక్కిలి నిమ్మళముగ లోపములఁ దెల్పి తప్పిదముల నొప్పించిన యనంతరముననే పైన వివరించినట్లు శిక్షించవలెను. పొరపాటునఁ దప్పొనరించినట్లెఱిఁగినపుడు శిక్షించక వార లట్టింకొకతూరి చేయకుండునట్లు హెచ్చరించి వదలవలెను. కాని శిక్షించరాదు.

పిల్లల శిక్షించునపు డొరులు చూడకుండ నొనరించవలెను. ఒరు లచ్చట నుండినచో వారు సిగ్గుపడుదురు. అటు లొకటిరెండుసారులు జరిగిన సిగ్గు వదలినవా రగుదురు. చాటునఁ గడునిదానముగ లోపములఁ దెల్పి వారిచే నొప్పించి నిష్పక్షపాతముగఁ దగుమాత్రము శిక్షణ మొనరించవలెను. శిక్ష కడు తేలికగను జ్ఞానోదయకరముగను నిఁక నట్టిపని చేయఁదలంచినపుడు స్మరణకు వచ్చునదిగను నుండవలెను. పిల్లలు తప్పునొప్పుకొనినపుడు శిక్షించక నిజముచెప్పినందుకు మన్నించి యిఁకనట్లు చేయకుండ నొప్పించి వదలుచుండవలెను.

కల్లబెదరులు పెట్టి పిల్లలు భయపడునట్లు చేయుట కడు నింద్యము. చీఁకటియందుఁగాని చాటునఁ గాని చప్పుడగుచున్న దయ్యము లుండుననియు

బూచివాఁడు వచ్చుననియుఁ జెప్పి భయపెట్టఁజూచుటచే వాండ్రు పెద్దలైనపుడు పిరికివారగుదురు. అవసరము కలిగినపుడు చీఁకటిమఱుఁగున బయటికరుగఁజాలకుందురు. ఇట్టి కల్లబెదరింపులవలన శిశువుల కుగ్గుపాలతో నసత్యములలవడును.

ఒకచోటికి కరుగుచు మఱియొకచోటికి కరుగుచునని చెప్పి వారు వెంట రాకుండఁ దప్పించుకొనఁజూచుటగాని నిజముగఁ జేయఁదలఁచిన పని చేయుదునని చెప్పుటగాని తగదు. ఏదేని యీయఁగూడని పదార్థము తమ కిమ్మని పిల్లలడిగినచో నావస్తువును మఱుఁగున నుంచి మఱియొకచిత్రపదార్థమును వారి కగుపఱచి వారి కీయఁగూడదని దాని మఱచిపోవునట్లు చేయవలెను. శిశువులు బుద్ధి తెలిసినవారైనచో నది వారి కేలయీయఁగూడదో బోధించి యీయకుండవలెను. దానివలనఁగలుగు నాపత్తులు చెప్పికాని మాయమయ్యెనని కాని తప్పించుకొనరాదు. అనంతరమిచ్చెదనని పట్టియాశయుఁ గల్పించరాదు. ఓపిక కలిగించుకొని వారికి మంచిమాటలతో నిజము తెల్పి యొప్పించవలెను. ఆదినుండియు నిట్టి పట్టుదలగలిగి తలిదండ్రులు పిల్లల నిట్లుసమదాయించుట మంచిది. తలిదండ్రు లనృతము నుడువరని యెఱిఁగిన పిల్ల లేవిషయమునఁగాని చెప్పినసంగతుల సంశయించక నమ్మి వారినుడుల సంచరించుచుందురు. ఇట్టి యభ్యాసముగల తలిదండ్రులకు శిశువులవలనఁగలుగు సంతస మొరులకు దుర్లభము.

ముద్దుకుఁ బిల్లలొండొరులు నిందించుకొనునట్లుకాని తలిదండ్రుల నిందించునట్లుకాని పురికొల్పరాదు. దీనివలన వారికిఁ జెడుమాటలలవడుటే కాక వారియందన్యోన్యప్రేమ తఱిగి తలిదండ్రుల గౌరవించుటయును మఱచెదరు.

పసితనమునుండియు శిశువులు తలిదండ్రులను సోదరులను బంధువులను నౌకరులను యాచకులను బ్రేమించునట్లును నందఱితో సాదరముగ మాటలాడునట్లును నలవాటుచేయవలెను. శిశువుల కొకరియం దొకరి కనురాగము కలుగునట్లును నొకరు తిను పదార్థ మింకొకరికిఁ బంచియిచ్చునట్లును నవసరము కలిగినపు డొకరివస్తువు మఱియొకరు వాడుకొనుట కుల్లాసముగ నుండునట్లును నొకరికొకరు తోడ్పడుచుండునట్లును నేర్పవలెను. అట్లుచేయనొల్లనివారి కెదుటివారి వస్తువు కావలసివచ్చినపుడు తెలియఁజెప్పి యాశకు వట్టిలోప మెప్పుడును జేయున ట్లొప్పించవలెను. తమ పదార్థము నొరులకుఁ బంచియీయనొల్లనివారి యెదుట మఱియొకమంచివస్తువు రెండవవారి కిచ్చి తనవస్తువు పంచియీయనందుల కది శిక్ష యని బోధించవలెను. మరల నెప్పుడేని యట్టి పదార్థవిభజనము కొందలిడినపుడు జ్ఞాపకముచేసి యొప్పించుచుండవలెను. కుటుంబసౌఖ్యమునకుఁ బ్రేమయే ముఖ్యకారణము. నూఱుబహుమతు లొసఁగుటకంటె దయగల యొక చూపుగాని యొకమాటగాని పసివారికిని బెద్దలకును మఱపురాని యుల్లాసము కలిగించును. తనవారిని బ్రేమించనివా రొరులను బ్రేమించఁజాలరు. దైవము నంతకంటెఁ బ్రేమించఁజాలరు. ఆత్మనిందచే విచారమగ్నమానసులగుదురు. తనను తనవారిని లోకమును దేవుని లోఁబఱచుకొనఁ బ్రేమాయుధము చాలును. పసితనమునుండియు నేర్పినం గాని యీ దివ్యాయుధప్రయోగకౌశలము శిశువుల కలవడదు.

జంతుసంతానమున మానవజాతి కాధిక్యముగలిగించునది వివేక మొక్కటియే. అట్టివివేకము దయాకలితమైనఁగాని ప్రకాశింపదు. మానవులకు యోగ్యతనిచ్చు మూలమంత్రము దయగల స్వభావము. అదిలేనివారు పశువులకంటె హీనులు. కావున బిడ్డలు దయకలిగియుండుట నాబాల్యముగ నేర్పవలెను.

మొదలఁ దనను బిదపఁ దోఁబుట్టువులను దండ్రిని బంధువులను బరిచారకులను నిరుగుపొరుగువారిని దుద కన్నిజంతువులను బ్రేమించునట్లు పసితనమునుండియుఁ దల్లి నేర్పుచుండవలెను ఆ బాల్యము నట్టియలవా టొనరించినఁ దుద కది పరోపకారశీలతగఁ బరిణమించును. వీలగునంతవఱకు నొరులకు మంచిచేయు నలవాటును జెలుపుచేయుచుండునట్లు కట్టుబాటును గట్టిగ నేర్పవలెను. సకలసుగుణములలోఁ బరోపకారశీలత్వ మగ్రగణ్యమని యవకాశముకలిగినప్పుడెల్ల వివరించి బోధింపవలెను. వీలుకలిగినపుడెల్ల బిచ్చగాండ్రకు దానధర్మమును నిరుగుపొరుగువారికి ఫలాదులును గాయగూరలును బనివారిచే నిప్పించుటచే వారికిఁ బరోపకారశీలత్వ మలవడును. సకాలమున నొనరించిన మేలు ద్విగుణముగ ఫలమిచ్చునని మనంబుల కెక్కులాగునఁ దదాచరణముచేఁ దలిదండ్రులు పనివారికిఁ దెల్పుచుండవలెను.

పరులకొనరించు నుపకారము తల్లిదీవనవలె వెన్నంటి సంతసము నాపాదింపఁ గలిగియుండును. కాని పరులకొనరించు కీడు భంగపాటుగలిగించుచు గొప్ప ప్రవాహమున కెదురీదువాని ప్రయత్నమువలె నధోగతికి దిగలాగుచుండును. కావునఁ బరులకు మేలొనరించుట తమమేలుకొఱకే యని యెఱిఁగియుండవలెను. ఒరులకు మంచిచేయు నలవాటుగలవారి కెల్లరును సాయపడ వేచియుందురు. కావున నవసరముకలిగినపుడెవరికేని సాయమొనరించుటకు ముందడుగిడునట్లు శిశువులఁ బ్రోత్సహించుచుండవలెను. తనకు నీరుపోసి పెంచినవారికిని దనపై రాళ్ళురువ్వినవారికిని సమముగ నీడను ఫలముల నొసంగు వృక్షములవలె మంచివారు మిత్రులకును శత్రులకును నుపకరింప సమకట్టుచుందురు. జ్ఞానముతోపాటు పరోపకారచింతయుఁ బాపభీతియు దైవభక్తియు శుచియుందు లక్ష్యమును సనాతనమతానురక్తియుఁ బసితనమునుండియు నేర్పనిచోఁ బెద్దవారైన వెనుక నెంతప్రయాసపడినను బట్టువడుట దుర్లభము గాన నీపంచరహస్యరత్నములఁ దలిదండ్రులు తమ హృత్పేటికలనుంచి తఱుచుగ వెల్వరించి చూపి వానిచే శిశువుల నాబాల్యము నలరఁజేయుట పరమావశ్యకము. సర్వసుగుణములకును దయాసత్యశౌచశీలములు మూలములు. పరోపకారశీలుర భగవంతుఁ డాశీర్వదించియుండును. లోకులెల్లరు నట్టివారి యుద్యమములు కొనసాగవలెనని కోరుచుఁ జేతనైనవఱకుఁ దోడ్పడుచుందురు. లోకులు తమ కుపకరింపవలెనను కోరికగలవారెల్లరును బుద్ధిహీనులనియుఁ దామె లోకుల కెట్లుపచరింపఁగలమా యనియు నవ్యాజచింతగలవారలే మహానుభావులని శిశువుల కెఱిఁగించుచు నట్టి సుజనుల చరితల నెత్తి బోధించుట ముఖ్యకర్తవ్యము. ఈశ్వరదృష్టికి సర్వజనులును సమానులే. కావున వీర లొకరి కొకరు సాయమొనరించుకొనుచుండుట భగవత్ప్రీతికరము. చేఁపల కీఁతయుఁ బక్షుల కెగురుటయు నలవడునట్లు శిశువులకుఁ బరోపకారచింత బాల్యప్రభృతి యలవడవలెను.

# జాతకచర్య

## గురుచరితము

జాతకచర్యలో నిది ద్వితీయ ప్రకరణము. ప్రథమ ప్రకరణము స్వకీయులచరిత్ర. జాతకచర్యయన స్వచరిత్ర. స్వచరిత్రకుఁ బూర్వము జనకాది స్వపూర్వచరిత్ర విధిగా విలిఖితవ్య మగుట నావిలేఖన మాదౌపితా మొదలగు శ్లోకములలోని వరుస ననుసరించి మొదలుపెట్టి పితృస్యాలకాంతముఁ జేర్కొంటిని. వీరందఱును రక్తసంబంధులు. కనుక స్వకీయులు. స్యాలకాంతమైన యీ స్వకీయుల చరిత్ర సమాప్తము చేసి తదవ్యవహితోత్తరవర్తి స్వామినోగురురిద్ధినయను శ్లోకపాదములోనివారి చరిత్రము వాకొనఁ బోవుచున్నవాఁడను. అం దగ్రిమస్థ స్వామిశబ్దార్థము ప్రభువు. జనకాది స్యాలకాంత స్వరక్తసంబంధుల (స్వకీయుల) కే కాక స్వస్వామికిఁగూడఁ దర్పణము విడువుమనియుఁ బిండము వేయుమనియు నాదౌపితాది ధర్మశాస్త్రవాక్యము లనుశాసించుచున్నయవి.

శ్లో. శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచా ప్యపలాయనం
దాన మీశ్వరభావశ్చ క్షాత్రంకర్మ స్వభావజం. భ॥ గీ॥ 18అ43.

శౌర్య తేజో ధృతి దాక్ష్యయుద్ధాపలాయన దానేశ్వరభావములు క్షత్రియులకు సహజధర్మములు. క్షత్రియులే సర్గాదినుండియు క్షాత్రచక్రమునకు స్వాములై జనుల సంరక్షించుచున్నారు. బ్రాహ్మణులఁ బరమపూజ్యులుగా భావించి వర్ణాశ్రమధర్మముల వర్ధిల్లఁ జేసియున్నారు. అందువలననే యాబ్రాహ్మణులకుఁగూడ నాక్షత్రియప్రభువులకుఁ దర్పణము విడుచుటయుఁ బిండము వేయుటయు విధిగా నేర్పడినది. నడుమఁ బొసఁగిన నడవడిభేదముచే నాచారములు మార్చుకొని వ్యవహరించెడి యిప్పటి సవర్ణవైదికనియోగులకుం బోలె నసవర్ణులైన యప్పటి బ్రహ్మక్షత్రియులకు సపంక్తి శ్రాద్ధభోజనాదులును గ్వాచిత్క్యముగా సంబంధబాంధవ్యములును జరుగుచు వచ్చినవి.

ప్రత్యేకించి గోత్రములు బ్రాహ్మణులకే పరంగెడిని గాని క్షత్రియవైశ్యులకుఁ బురోహితబ్రాహ్మణగోత్రములే పూర్వఋషులు ప్రసంగించియున్నవారలు. అట్టి సగోత్రక్షత్రియప్రభువున కట్టు తర్పణపిండదానములు ధర్మశాస్త్రసిద్ధము లైపోయినవి. అద్యతనప్రభువు లట్టిక్షత్రియులు గాకునికిని బిండములు పెట్టుట పృథివీసురులకుఁ దప్పినను జరిత్రలేఖనాదికమున నైనను స్వామిభక్తి చూపుట సద్ధర్మము. కాని యిప్పటి మన యింగ్లీషుప్రభువు లెల్ల యీక్షింపరానంత యిల నేలుచున్నారు. సనాతనషట్చక్రవర్తులు గూడ సమభ్యసింపని సంగరవిధులు నేర్చి శత్రువులకు జయ్యులుగాక సంచరించుచున్నారు. అట్టి యఖండభూమండలాధిపతుల చరిత్ర యల్పిష్ఠుఁడనైన నేనణుమాత్రము లిఖించుటకును నసమర్థుఁడను. అవ్వార లాంగ్లేయులు. అన్యద్వీపవాసులు. అన్యమతస్థులు. అట్టివారిచరిత్ర మాంగ్లేయభాషావిదులకే యవగతము కావలెఁ గాని యత్కించిదభ్యస్తాంధ్రసంస్కృతభాషుల కందరానిది. అట్టి యాంగ్లభాషాకోవిదు లనేకు లవ్వారి చరిత్ర

మనేకథా వ్రాసియున్నారు వ్రాయుచున్నారు. వ్రాయనున్నారు. అందువలన నశక్యమైన యప్పనికిఁ గడంగక యాదౌవితా యనెడి లీప్సులోని స్వామిశబ్దానంతరస్థమగు గురుపరిసరమున కరఁగుచున్నవాఁడను. గురుశబ్దవాచ్యులు కొంద ఱున్నను జదువుఁజెప్పిన వారియెడలను మంత్రముపదేశించినవారియెడలను బిదపఁ బీఠాధిపతులయెడలను నయ్యాది రూఢము. వీనిలోని యుపదేష్ట్రుపాధ్యాయులకును దా గురుఁడగుటఁ బీఠాధిపతి పెద్ద గురువు. అందువలననే యాయన జగద్గురుబిరుదమున సమలంకృతుఁడు. గురుపీఠమనునది ధర స్థాపించినవాఁడు శంకరాచార్యులు. కనుక నాయన చరితమే మునుమున్ను వ్రాయఁ దగినది. తచ్చరితము దండిదండిపండితు లెందఱో తాము వ్రాసియున్నవారు. వ్రాయు చున్నారు. వ్రాయనున్నారు. అయినను

శ్లో. వాల్మీకిగీతరఘుపుంగవకీ_ర్తిలేశైః
తృ_ప్తింకరోమి కథమ ప్యధునా బుధానాం,
గంగాజలై ర్భువి భగీరథయత్నకౢప్తైః
కిం తర్పణం నవిదధాతి జనః పితౄణాం ?

అని యారంభించి భోజరాజు చంపూరామాయణమును సలిపినట్లు నేను నా యల్పజ్ఞానములో శంకరగురుచరితమును సంగ్రహించి వ్రాయుచున్నవాఁడను. ఈచరిత మిప్పటికి 40 ఏండ్లనాఁడు శ్లోకరూపముగను 36 ఏండ్లనాఁడు మాధవాచార్యకృత శంకరవిజయమున కాంధ్రీకరణముగను 20 యేండ్లనాఁ డదే శంకరవిజయమునకు సంక్షిప్తాంధ్రవచనముగను వ్రాయ మొదలుపెట్టి పరిపూ_ర్తిచేయుటకుఁగాని ప్రచురించు టకుఁగాని భాగ్యము లేక పడవేసియుంచితిని. ఆవ్రాసినదే యాచార్యచరిత సంగ్రహముగాఁ దెలియునట్లు సరిపుచ్చి ప్రస్తుతము ప్రకటించుతును. అం దాదిమములైన శ్లోకములు శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షపీఠసాన్నిధ్యమం దుండినప్పుడు వ్రాయఁబడినవి. అప్పటి తత్పీఠాధిపతు లైన శ్రీ విద్యారణ్యభారతీస్వాములవారు విద్వత్పక్షపాతులు. వివిధవిద్యా ప్రవేశము గలవారు కనుక

సీ. తొలుదొ_ల్తఁ జేసితిం బలువు రౌనౌనన
బలుపురాణంబుల ప్రవచనంబు,
అష్టావధాన శతావధానాదుల
కావించి ప్రస్తుతిం గాంచియుంటి,
మఱియు విరూపాక్షగురుపరంపరయన
వ్రాసితిఁ గృతిని గీర్వాణభాష,
కురిసితిఁ బద్యంపు వరవర్షమును మాట
మాటకు నే నాశుధాటితోడ,
ఈవిధముగఁ బూర్వ మీపీఠసన్నిధి
పాండితియును గవితఁ బ్రకటపఱచి

ప్రీతిపాత్రమైతిఁ బీఠాధిపతులకు
సచివులకును వారి జనములకును.

సీ. ప్రభువు విద్యారణ్యభారతీస్వామి న
న్నాంతరంగికుఁగాఁగ నాదరించె,
తమదు నాస్థానవిద్వత్కవి యనిచెప్పి
అభిమానముం జూపె నగ్గలముగ,
సాలువుల్ నూఱార్లుచాలసారు లొసంగె
రహి బహుమానపురస్సరముగ,
తనచేతిమీఁదుగా ననుఁగూర్చి లిఖియించె
అపుడప్డు లేఖల నధికప్రేమ,
పంచదశవత్సరంబులు పత్రికకుఁ బ్ర
థానపోషకభృతియిచ్చెఁ బోనపుడును
మఱి వివాహాదికార్యముల్ మధ్యమధ్య
ఏగుదెంచినఁ దీర్చె మదీప్సితములు.

అట్లువ్వారి యభిమానమునకుఁ బాత్రుఁడనై తత్పరమాహాత్మ్యమును వ్రాయఁ దలఁపుపెట్టుటయు నాస్వాములును నంగీకారమును సూచించిరి. అయినను 54 శ్లోకములతోనే యయ్యుద్యమ మాఁగిపోయెను. ఆ శ్లోకములు చాలవఱకు శంకరగురుచరితమునే చాటెడిని గానఁ దిగువఁ దిలకింతురుగాక.

—♦ గురుపరంపర ♦—

శ్లో. శ్రీరామాఖ్యం మహ ఇహ సీతావల్లభ మఖండ మద్వైతం
దూరీకరోతు మమహృది దుఃఖద మజ్ఞాననామకధ్వాంతం. 1
ముహు రహ మిహ బహుమనుజాన్
రహితకృపా నపి వివేకరహితస్సన్
విహితాన్ మత్వా కృతవాన్
విత్తస్పృహయా విశేషనుతిభాజః. 2
ఇహవా పరత్ర తేభ్యో నహినహి లాభో రసానభిజ్ఞేభ్యః
బహుధా భక్షితు లశునం భవితవ్యః కిల రుజావినాశో వా! 3
ఫలరహితకృత్యకరణం పండితలోకస్య నోచితం భవతి
ఫలమపి తత్ఖిలతావ త్కలుషజనాశ్రయకరస్యహి నరస్య! 4
కలుషజనవర్ణనాతః కాలుష్యవతీ మదీయవాగేషా
కలుషహరైతచ్చరితం రచయిత్వా తాం కరోమి గతకలుషాం. 5

గురుపారంపర్య మహాంశ్చ స్వీకృత్యాథ పీఠమాహాత్మ్యం
కరవాణి చరితబహుళం కఠినతరోక్తి ర్విహాయ మృదువాణ్యా. 6
శ్రీకంఠ శ్శితికంఠ శ్శ్రితజనగణ నీలకంఠజీమూతః
నాకివరేడ్య స్స జయతి నగజార్ధశరీరధృ జ్మహాదేవః. 7
నారాయణ స్తతోభూ న్నానాలోకావనేసమర్థస్సన్
క్రూరాసురాంతకారీ కృష్ణా ద్యవతారదశకధారీ సః. 8
చతురాననై ర్విరించి స్తన్నాభీసరసిజాంతరే భూత్వా
కృతనిఖిలభువనసృష్ట్యాద్రుతమే వాత్యంతకీర్తనీయోభూత్. 9
తస్మా దజని వసిష్ఠ స్తపసి గరిష్ఠ శ్శమాది భూయిష్ఠః
అఖిలమునీశశ్రేష్ఠ శ్చాత్మవినిష్ఠః పవిత్రితాఘిష్ఠః. 10
రఘుకులపురోధసా శ్రీరామాగమనం నిరీక్షితం యేన
అఘహార స్యాస్యమునే రజని తనూజ, స్స శక్తిసంజ్ఞో భూత్. 11
తదను పరాశరనామా తస్మా దుద్భవ మవాప మునిరాజః
యదనుగ్రహేణ సుషువే వ్యాసం మౌనీంద్రమేవ సత్యవతీ. 12
స వ్యాసఏవ కృతవాన్ సకలపురాణాని శ్రుతివిభాగంచ,
స్తవ్యోతఏవ కృష్ణద్వైపాయనసంజ్ఞయాయ మాసీద్వై. 13
య దుదీర్యతే పురాణా న్యకరో త్స పవిత్రఘాపహానీతి
త దళీకమేవ యస్మా త్పతితాపతితాపి యాతి హరినగరీం. 14
సబుభుషి శ్శ్రుతిబదరీత స్తదంతతూలా న్త తద్వచోంశుగణైః
విరచయ్య బ్రహ్మసూత్రా ణ్యరసీ బుభుషచ ముముక్షుప్రాణాం.
స పుపోష శుక మహైకం సకలపురాణార్థసార సుతృప్తైః,
జపపంజరే స్థితోసౌ సత్యంబ్రహ్మేతి కీర్తయ న్వవృధే. 16
భూమిసుర శాపదగ్ధం భూపాలం సతు పరీక్షిదభిధానం
శ్రీమద్భాగవతాంభ స్సేకేనోద్ధృత్య చాత్మపద మనయత్. 17
మాతౄఇవ పరదారా న్మహితంలోష్టమివపరధనాదీంశ్చ
భూతా న్యాత్మానమివాబోధ, త్స బ్రహ్మ సర్వతోఽపశ్యత్. 18
అస్యశుకాహ్వయమౌనే రంతేవాసీ స గౌడపాదాఖ్యః,
తస్యాంతేవాస్యాసీ త్తజ్జ్ఞో గోవిందనామయోగీంద్రః. 19
కామాద్యరిషడ్వర్గః కాంక్షామే వాకరో న్న తస్య జయే
భీమోపి జగతి బాధం భీమపురోగ త్రిమూర్తి జేతాపి. 20

# సహాయులు

౧ మెదక్ శివశంకరరావు దేశముఖుగారు, నల్లపల్లి
౨ పాండిత్య వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౩ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణము, దుగ్గిరాల
౪ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యులు అయ్యవార్లంగారు. కాంచీపురము.
౫ రాయచూరి బంబేరావుగారు, అయినాపురము.
౬ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి.
౭ చిక్కారాజా మట్టపల్లిరావుగారు - వెలవర్తి.
౮ నాదరగుల్ సంగమేశ్వరరావు శేఠ్‌గారు శ్రీశ్రీ జగద్గురు పుష్పగిరి సంస్థానపు ఏజంటు
౯ అద్దంకి ... తిరువేంగడతాతదేశికాచార్యులయ్యవార్లంగారు, కొల్హాపురము.
౧౦ మిర్యాలపురం రామకృష్ణారావుగారు, కొల్లాపురం.
౧౧ మల్లాది నరసింహమూర్తిగారు, ప్లీడరు, గుంటూరు.
౧౨ కరిశాల వెంకటేశ్వరరావుదేశముఖుగారు, పులిగిల్ల
౧౩ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావుగారు, లింగగిరి.
౧౪ జింకా వెంకటసుబ్బారావుగారు, వకీలు, గుంటూరు.
౧౫ వద్దిరాజు సత్యనారాయణరావు దేశపాండ్యాగారు, కోడిపల్లి.
౧౬ గొట్టిపర్తి సుబ్బారావుగారు, వకీలు, సింగరేణి కాలరీసు.
౧౭ మారేపల్లి వెంకటకిషన్ రావు, మాధవరావు దేశముఖుగార్లు, కొత్తపల్లి.
౧౮ దంటు లక్ష్మీనరసింహముగారు - మద్దపల్లి.
౧౯ మద్దూరు సాంబయ్యగారు - సాగానుకంపెని - పరుచూరు.
౨౦ ముద్దు చంద్రయ్య, మారేపల్లి మారుతిరావు దేశముఖుగార్లు-కొత్తపల్లి.
౨౧ రాయప్రోలు సుబ్బారావుగారు, ప్రొఫెసర్, యూనివర్సిటీకాలేజి, హైదరాబాదు
౨౨ పెసర వెంకటరెడ్డి దేశముఖుగారు, పుల్లారెడ్డిపల్లె
౨౩ గడ్డం వెంకటనరసింహారెడ్డి దేశముఖుగారు, చెలుకపల్లి

# అభినవసరస్వతి

సంపాదకుఁడు — నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 8—0—0